

# ఈ కార్లకు డ్రైవింగ్ తెలుసు!

**కంప్యూటర్ కనిపెట్టాడు... అంతర్జాలంతో అవనిని చుట్టేశాడు... చేతిలో ఇమిడే సెల్‌ఫోన్‌తో జీవనవిధానాన్నే 'స్మార్ట్' చేసేశాడు... అయినా ఇంకా ఏదో సాధించాలి... వేళ్ల మధ్య నుంచి జారిపోతున్న సమయాన్ని ఒడిసి పట్టాలి... ఎన్నెన్నో పనులు... మల్టి టాస్కింగ్ మాయాజాలంలో ఇరుక్కున్న మనిషికి 24 గంటలు సరిపోవడం లేదు. అందుకే ఎన్నో యంత్రాలు కనిపెడుతున్నాడు. వాషింగ్‌మెషీన్, డిష్ వాషర్ లాంటి గృహోపకరణాలతో మొదలెట్టి రోబోల వరకూ ఎన్నో వస్తువులు. టైమ్ సెట్ చేసి స్విచాన్ చేస్తే ఆటోమేటిగ్గా పని చేసేస్తున్నాయి. అలాంటప్పుడు కారుని మాత్రం ఇంకా మనమే ఎందుకు నడపాలి? గంటలకొద్దీ సమయం ఎందుకు వృథా చేసుకోవాలి? ప్రమాదాలకు ఎందుకు గురి కావాలి?**

మనిషి చలనశీలి. కదలిక ప్రగతికి మార్గం. ఉన్నచోటే ఉంటే శతాబ్దాలు మారతాయి కానీ చరిత్ర మారదు. కొత్త అవకాశాలను అందిపుచ్చుకోవాలి... కొత్త ప్రాంతాలను సందర్శించాలి... కొత్త విషయాలను కనిపెట్టాలి. మనిషిలోని ఈ తీరని దాహానికి సమయాన్ని ఆదా చేయాలన్న కోరిక తోడై ఇప్పుడు కార్ల తయారీదారులను కొత్త పరిశోధనల వెంట పరుగులు తీయిస్తోంది. అత్యంత ఆధునిక సాంకేతికతతో గాల్లో తేలిపోతున్నట్లు దూసుకుపోయే కార్లొచ్చాయి. అయినా ఆశ తీరలేదు. ఇప్పుడిక సారథి లేని రథాల తయారీలో కంపెనీలు తలమునకలవుతున్నాయి. త్వరలోనే స్టీరింగ్ చక్రం లేని నాలుగు చక్రాల వాహనం దూసుకుపోనుంది. అలాంటి కారును అందుబాటులోకి తేవడానికి ఆటోమొబైల్ సంస్థలు పోటీ పడుతోంటే వాటికి దీటుగా మేమున్నామంటున్నాయి గూగుల్, ఆపిల్ లాంటి టెక్ సంస్థలు. అందుకు అవసరమైన కృత్రిమ మేధ (ఏఐ) పరిశోధనకి ఈ సంస్థలన్నీ లక్షల కోట్ల రూపాయలు కుమ్మరిస్తున్నాయి. డ్రైవరు లేకుండా రోడ్డుమీద నడిచే కారునే కాదు ఏకంగా గాలిలో ఎగిరే కారునీ సిద్ధం చేస్తామంటున్నాయి. ఐహెచ్ఎస్ (ఇన్ఫర్మేషన్ హ్యాండ్లింగ్ సర్వీసెస్) అంచనా ప్రకారం 2025కల్లా పలు దేశాల్లో రహదారులపై రెండు కోట్ల వరకూ డ్రైవర్ రహిత వాహనాలు తిరిగే అవకాశముంది.




### అలా మొదలైంది

డ్రైవరులేకుండా కారు నడపాలన్న ఆలోచన దాదాపు వందేళ్ల నాటిది. ఆ ఆలోచనే పలు సినిమాల్లో డ్రైవరులేకుండా నడిచే కారుని ప్రధాన ఆకర్షణగా చేసింది. ఎప్పుడూ ఎక్కడో ఓ చోట దానికి సంబంధించి ప్రయోగాలు జరుగుతూనే ఉండేవి. 1980వ దశకం నుంచీ మాత్రం ఈ ప్రయత్నాలు ముమ్మరమయ్యాయి. ఆటోమొబైల్ సంస్థలు విశ్వవిద్యాలయాల పరిశోధనా విభాగాలతో కలిసి పనిచేయడం ప్రారంభించాయి. 1995లో తొలిసారిగా కార్నెగీ మెలన్ యూనివర్శిటీ వారి నవ్‌లాబ్5 పాంటియాక్ ట్రాన్ స్పోర్ట్ కారు అమెరికాలో 2,849 మైళ్లు ప్రయాణించింది. అందులో 98.2 శాతం ప్రయాణం డ్రైవరు సహాయం లేకుండానే జరిగింది. ఈ సంఘటన తర్వాత అన్ని సంస్థల ప్రయోగాలూ ఊపందుకున్నాయి.



దాదాపు రెండేళ్ల క్రితం సంగతి. టెస్లా కార్లు కొనుక్కున్నవారు కొందరు కారులో స్టీరింగ్‌ని వదిలేసి పేపరు చదువుతూ, ఫోన్లో సందేశాలు పంపుతూ, కాఫీ తాగుతూ తీసుకున్న వీడియోలు సామాజిక మాధ్యమాల్లో సంచలనం సృష్టించాయి. కారు కొన్నవారికి అదనంగా మరో 4,250 డాలర్ల ధరకు ఓ టెక్నాలజీ ప్యాకేజీని అందించింది ఎలక్ట్రిక్ కార్ల కంపెనీ టెస్లా. పలురకాల సెన్సార్లు, కెమెరా, ముందువైపు రాడార్, డిజిటల్ బ్రేక్స్ లాంటివన్నీ ఈ ప్యాకేజీలో భాగం. వీటి సాయంతో డ్రైవర్ జోక్యం లేకుండా కార్లు నడుస్తాయి. వాటంతటవే మార్గాన్ని మార్చుకుంటాయి. ఇంకా ముఖ్యంగా... దేన్నైనా ఢీకొనే పరిస్థితి వస్తే ముందుకు కదలకుండా ఆగిపోయి ఢీకొనే ప్రమాదాన్ని నివారిస్తాయి. ఈ ప్యాకేజీకి ఆదరణ బాగా ఉండడంతో ఆ తర్వాత సాఫ్ట్‌వేర్‌ని అప్‌డేట్ చేసి ఆటోపైలట్ ఆప్షన్‌ని వినియోగదారులందరికీ పంపించింది టెస్లా కంపెనీ. కారులో టచ్ స్క్రీన్ సహాయంతో ఈ ఆప్షన్‌ని ఎంచుకోవచ్చు. లేదా తీసేయొచ్చు. ఇలాంటి వాహనాలు రోడ్డుమీదికి

## వెహికిల్ అటానమీ లెవెల్స్ ఈ ఐదూ!

వాహనంపై నియంత్రణ స్థాయిని బట్టి సొసైటీ ఆఫ్ ఆటోమోటివ్ ఇంజినీర్స్(ఎస్ఏఈ) వాహనాలకు ఈ స్థాయులు నిర్దేశించింది.

**లెవెల్ జీరో:** సాధారణంగా మనుషులు నడిపే వాహనమే.

**లెవెల్ 1:** అడప్టివ్ క్రూయిజ్ కంట్రోల్ అంటారు వీటిని. పార్కింగ్‌లో, లేన్ మారాలన్నా డ్రైవరు సహాయం కావాలి. వాహనాన్ని అదుపులోకి తీసుకోవడానికి డ్రైవరు ఎప్పుడూ సిద్ధంగా ఉండాలి.

**లెవెల్ 2:** కారు స్వయంగా వేగం పెంచుకుంటుంది, బ్రేక్ వేస్తుంది, స్టీరింగ్ తిప్పుకొంటుంది. అయితే ఏ క్షణాన్నైనా ఆటోమేటెడ్ వ్యవస్థ విఫలమైతే తక్షణం స్పందించడానికి డ్రైవరు సిద్ధంగా ఉండడమే కాక చుట్టుపక్కల పరిస్థితులను నిశితంగా గమనిస్తూ ఉండాలి.

**లెవెల్ 3:** ఈ కారు చుట్టుపక్కల పరిస్థితులను అంచనా వేస్తూ మామూలు రోడ్డుమీద వెళ్లగలదు. అయితే అది ఊహించదగ్గ పరిస్థితుల్లో మాత్రమే. కాబట్టి డ్రైవరు సిద్ధంగానే ఉండాలి.

**లెవెల్ 4:** మరీ అసాధారణ ట్రాఫిక్ పరిస్థితుల్లో తప్ప మిగతా అన్నిచోట్లా ఈ కారు దానంతటదే నడవగలదు. సాధారణంగా ఒకసారి అటానమస్ సిస్టమ్ యాక్టివేట్ చేశాక డ్రైవర్ దానిమీద దృష్టిపెట్టాల్సిన అవసరం లేదు. ప్రస్తుతం పలు సంస్థలు దీన్నే పరీక్షిస్తున్నాయి.

**లెవెల్ 5:** గమ్యం చెప్తే చాలు, సొంతంగా నిర్ణయాలు తీసుకుని సురక్షితంగా వెళ్లిపోతుంది ఈ కారు.



## వాళ్లలా లెక్కలేశారు!

దివ్యాంగులకూ వాహనం నడపలేని వారికీ సెల్ఫ్ డ్రైవింగ్ కార్లు వరం లాంటివంటున్నారు నిపుణులు. ఈ మేరకు బ్రిటన్‌లో ఇప్పటికే లెక్కలు వేసేశారు. ఈ కార్లు ఉపయోగంలోకి వస్తే దేశ ఆర్థిక వ్యవస్థకు ఏటా 8 బిలియన్ పౌండ్ల వృద్ధి చేకూరుతుం దని వారి అంచనా. వైకల్యం, ఇతరత్రా ఆరోగ్య సమస్యల వల్ల స్వయంగా వాహనం నడపలేని వాళ్లు ఇంటికి పరిమితమై పోవడం వల్ల విద్యా, వ్యాపార నైపుణ్యాలను పెంపొందించుకోలేకపోతున్నారు. దాంతో వారి ఉత్పాదకత కుంటుపడుతోంది. సంపాదన అవకాశాలు కోల్పోతున్నారు. సెల్ఫ్ డ్రైవింగ్ కార్లు వస్తే వాళ్లు ఇతరుల మీద ఆధారపడకుండా తమ పనులు తామే చేసుకుంటారు. నైపుణ్యాలూ సంపాదనా పెంచు కుంటారు. ఇలా పది లక్షల మంది వరకూ లబ్ధి పొందుతారనీ దానివల్ల దేశ ఆర్థిక వ్యవస్థకు లాభం చేకూరుతుందనీ నిపుణుల అభిప్రాయం.



వస్తే జరిగే పరిణామాలను ఎదుర్కొన డానికి కావలసిన చట్టాలేవీ అప్పటికి లేవు. దాంతో సమస్యలొస్తాయని భావించిన సంస్థ సాఫ్ట్‌వేర్ స్థాయిని తగ్గించింది. అయితే మనిషికీ, వాహనానికీ, రవాణా వ్యవస్థకీ మధ్య ఉన్న అనుబంధానికి కొత్త అర్థం చెప్పింది ఈ ప్రయోగం. అప్పుడు టెస్లా వాడింది లెవెల్ 2 సాంకేతికత.

జనరల్ మోటార్స్... వందేళ్లకు పైగా చరిత్ర గల కంపెనీ. గత ఫిబ్రవరిలో ఈ సంస్థ శాన్‌ఫ్రాన్సిస్కో వీధుల్లో తీసిన రెండు వీడియోలు విడుదల చేసింది. సెల్ఫ్‌డ్రైవింగ్ కార్ల విషయంలో తాము ఏమాత్రం వెనకబడి లేమని ప్రకటించింది. డ్రైవరులేని షెవీ బోల్ట్ కారు 20 నిమిషాల పాటు ప్రయాణించడం ఈ వీడియోలో కన్పిస్తుంది. ప్రయాణికులు కారెక్కి తమ దగ్గరున్న క్రూయిజ్ ఆప్ ద్వారా గమ్యాన్ని నిర్దేశించుకుంటే చాలు కారు బయల్దేరుతుంది. కాలిఫోర్నియాలో ఈ కార్లు గత ఏడాది పదివేల మైళ్లు తిరిగాయి. లిఫ్ట్ పేరుతో ప్రత్యేక విభాగం కింద జనరల్ మోటార్స్ 2015లోనే అటానమస్ కార్ల అభి వృద్ధికి శ్రీకారం చుట్టింది. మిగతా పోటీదా రుల లాగా తమ ప్రయోగాల గురించి పూర్తి వివరాలు వెల్లడించడానికి ఇష్టపడని ఈ సంస్థ 2021ని లక్ష్యంగా పెట్టుకుని, బిలియన్ డాలర్ల ప్రాజెక్టును అమలుచేస్తోంది. పరీక్షి స్తున్న కార్ల సంఖ్యను కూడా 50 నుంచి 180కి పెంచింది.

### మేమే ముందు

సెల్ఫ్ డ్రైవింగ్ కార్లను అందరి కన్నా ముందు తామే రోడ్డుమీదికి తెస్తామంటోంది ఫోర్డ్. 2021 కల్లా పూర్తి స్థాయి స్వయంచోదక వాహనం ప్రజలకు అందుబాటులోకొస్తుందనీ, అందుకు పరిశోధన పెద్ద ఎత్తునే సాగుతోందనీ ప్రకటించింది. అందుకోసం ఈ సంస్థ ఏకంగా 6,463 కోట్ల డాలర్లు ఖర్చుపెడుతోంది. స్టీరింగ్ వీల్, బ్రేక్, యాక్సిలరేటర్ పెడల్స్ లేకుండా డ్రైవర్ అవసరం అసలేమాత్రం లేని కారును 2021 కల్లా రోడ్లమీదికి తెస్తామం టోంది. ఉబర్, గూగుల్ చేపట్టిన పైలట్ ప్రాజెక్టుల్లో చిన్న చిన్న ప్రమాదాలు నమోదయ్యాయి. అలాంటివేమీ జరక్కుండా జాగ్రత్తపడాలనే ఫోర్డ్ పూర్తి స్థాయిలో లెవెల్ 4 సాంకేతికతతో రోడ్డుమీదికి రావాలనుకుంటోంది.

### వేయీ వేయీ కలిపి...

ఆటోమొబైల్ సంస్థలూ, టెక్నాలజీ కంపెనీలూ చేయీ చేయీ కలిపి అటానమస్ వాహనాల అభివృద్ధికి రంగం సిద్ధంచేస్తు న్నాయి. ఒకరు వాహనాలను తయారు చేస్తే మరొకరు డ్రైవరు అవసరం లేకుండా వాహనం నడిచే సాంకేతికతను






## వారెన్ బఫెట్ ఏమన్నారంటే...

అటానమస్ కార్లు వినియోగంలోకి వస్తే బీమా రంగం కుదేలవుతుందంటారు వారెన్ బఫెట్. ఈ కార్లు సురక్షితంగా ఉంటాయి కాబట్టి ప్రమాదాలు జరగవనీ దాంతో ఇన్సూరెన్సు అవసరం ఉండదనేది ఆయన అభిప్రాయం. ఆయన కంపెనీ బెర్క్‌షైర్ హాథ్‌వే వాహనబీమా రంగంలో ఉంది. వాహనతయారీ సంస్థలు బిలియన్ల కొద్దీ డబ్బును అటానమస్ సాంకేతికత కోసం ఖర్చు పెట్టడంతోపాటు ఎంతో మంది నిపుణులు సాంకేతికత అభివృద్ధికి కృషిచేస్తున్నందున అందరూ అనుకుంటున్న సమయం కన్నా ముందే ఈ కార్లు రోడ్డుమీదికి రావచ్చన్నది బఫెట్ అంచనా.



## ఈ ప్రయోగానికి మేం సిద్ధం

సాధారణంగా ఆటోషోలలో వాహన తయారీ సంస్థలు కొత్త వాహనాలను ఆవిష్కరిస్తుంటాయి. గత ఫిబ్రవరిలో జరిగిన డెట్రాయిట్ ఆటోషోలో మాత్రం వోల్వో ఓ తమాషా చేసింది. వేదిక మీద ఓ కుటుంబాన్ని ఆవిష్కరించింది. అన్నీ అనుకున్నట్లుగా జరిగితే తమ ఇద్దరు కుమార్తెలతో కలిసి అలెక్స్, పౌలా జంట ప్రపంచంలోనే తొలి సెల్ఫ్ డ్రైవింగ్ కారులో ప్రయాణిస్తారు. అటానమస్ వాహన సాంకేతికత, వాహనాలను నడిపే మనుషులు- వీరిద్దరి మధ్య జరిగే ఇంటరాక్షన్‌ని విశ్లేషించేందుకు 'డ్రైవ్‌మి' అనే కార్యక్రమాన్ని ప్రారంభించింది వోల్వో. అందులో నమోదు చేసుకున్న తొలి కుటుంబమే అలెక్స్, పౌలా. ఈ ఏడాది చివర్లో ఎక్స్‌సి90 అనే పూర్తి స్థాయి అటానమస్ కారును విడుదల చేయనుంది వోల్వో. డ్రైవరు లేని ఆ కారులో రోడ్డు మీదికి వెళ్లడానికి అలెక్స్ కుటుంబం ఏ మాత్రం భయపడడం లేదు. పైగా ఆ కారు ఎలా ఉంటుందో, దాని వల్ల తమ ప్రయాణాలు ఎలా మారిపోతాయో చూడాలని చాలా ఆత్రుతగా కూడా ఉన్నారు. ఉద్యోగస్తులైన వీరికి ఇద్దరు పిల్లలు. కారు డ్రైవ్ చేసే సమయం కలిసిరావడమే ఎంతో గొప్పని వారు భావిస్తున్నారు. అందుకు తగ్గట్టుగానే వోల్వో ప్రణాళిక సిద్ధం చేస్తోంది. వాహనాన్ని నడిపే పని లేనప్పుడు కార్లో కూర్చుని ఆఫీసు పనులు చేసుకోవడానికి వీలుగా తమ అటానమస్ వాహనాల్లో స్కైప్ కాన్ఫరెన్స్ కాల్ సదుపాయం కల్పించేలా మైక్రోసాఫ్ట్‌తో వోల్వో ఒప్పందం చేసుకుంది.




అందించనున్నారు. అందుకే గూగుల్ ఫియట్ క్రిస్లర్‌తో జతకడితే వోల్వో ఉబర్‌తో, డైమ్లర్ బాష్‌తో, మైక్రోసాఫ్ట్ టొయోటాతో జోడీ కట్టాయి. ఈ పొత్తుల వెనక లక్ష్యం కేవలం సెల్ఫ్ డ్రైవింగ్ కార్ల తయారీ మాత్రమే కాదు, నగర వాతావరణంలో ట్రాఫిక్ ఒత్తిళ్లను నివారించడం కూడా. స్మార్ట్ వ్యవస్థల వినియోగంతో ట్రాఫిక్ నిర్వహణ సులభతరం చేసి రోడ్డు ప్రయాణ భద్రత పెంచాలన్నది ఆశయం.

### అందరి చూపూ అటువైపే

అటానమస్ వాహనాలను రోడ్డుమీదికి తెచ్చే ప్రయత్నాల్లో ఉన్న సంస్థలన్నీ కూడా 2021నే లక్ష్యంగా పెట్టుకున్నాయి. ప్రస్తుతం నగరాల్లో వాడుకలో ఉన్న అద్దె ట్యాక్సీల్లాగా వాటిని అందుబాటులోకి తేనున్నాయి. ధర, నిర్వహణ ఖర్చు ఎక్కువగా ఉండడంతో వ్యక్తిగత వాహనాలు మాత్రం ఇప్పట్లో రాకపోవచ్చు. ఆశ్చర్యం కలిగించే విషయమేమిటంటే నిన్నమొన్నటివరకూ కార్ల విడి భాగాలు తయారుచేసే సంస్థలేవీ ఆటోమేటెడ్ కార్ల వ్యాపారం లాభసాటిగా ఉంటుందని భావించలేదు. అంతెందుకు ఫోర్డ్ మాజీ సీఈవో అలాన్ ములాలీ అయితే బహిరంగంగానే దీన్ని ఖండించేవారు. మనుషులు డ్రైవింగ్‌ని ఎలా ఆస్వాదిస్తారో ఆయన వర్ణించి చెప్పేవారు. అలాంటిది ఫోర్డ్‌తో పాటు ఇతర సంస్థలు కూడా ఇప్పుడీ రంగంలో ముందడుగేశాయి. అటానమస్ కార్లను మార్కెట్లోకి తేగల సత్తా ఉన్న కంపెనీలపై నేవిగెంట్ రీసెర్చ్ వెలువరించిన నివేదిక ప్రకారం ప్రథమ స్థానంలో ఫోర్డ్ తర్వాతి స్థానంలో జనరల్‌మోటార్స్ ఉన్నాయి. ఆ తర్వాత స్థానాల్లో రెనో-నిస్సాన్, డైమ్లర్ ఉన్నాయి. 2015 సర్వేలో అసలు టెక్ కంపెనీల ప్రస్తావనే లేదు. అలాంటిది ఈ ఏడాది గూగుల్ 'వేమో' ఏడో స్థానంలో ఉంది. టెస్లా 12, ఉబర్ 16 స్థానాల్లో ఉన్నాయి. వివిధ కారణాల వల్ల ఎలక్ట్రిక్ కార్ల ప్రాజెక్టును పక్కన పెట్టిన ఆపిల్ కూడా హెర్ట్జ్‌తో కలిసి స్వయం చోదక కారుని కాలిఫోర్నియాలో పరీక్షిస్తున్నట్లు ఇటీవలే అధికారికంగా ప్రకటించింది. కృత్రిమ మేధకు సంబంధించిన ప్రాజెక్టులన్నిటికీ ఈ అటానమస్ సాంకేతికతే పునాది కానుందని కంపెనీ సీఈవో టిమ్ కుక్ పేర్కొన్నారు. సాధారణంగా ఆపిల్ గాడ్జెట్ల పేర్లన్నీ ఐ అక్షరంతో మొదలవుతాయి కాబట్టి ఆపిల్ అటానమస్ కారుకి 'ఐకార్' అని పేరు పెట్టేసుకున్నారు అభిమానులు. 'ఆడి' కంపెనీ కూడా తన ప్రయత్నాల్లో తానుంది. లెవెల్-3 సాంకేతికతతో తయారుచేస్తున్న కొత్త ఎ8 కారుని 'స్పైడర్‌మాన్-హోం కమింగ్' టీజర్స్‌లో చూపించింది. 'వేమో' అన్నది గూగుల్ అటానమస్ కార్ ప్రాజెక్ట్ పేరు. ఎనిమిదేళ్ల క్రితమే మొదలెట్టిన ఈ ప్రాజెక్టుకి వేమో అన్న పేరును మాత్రం కొత్తగా పెట్టింది గూగుల్ మాతృసంస్థ అల్ఫాబెట్. 2009లోనే రోడ్డెక్కిన గూగుల్ డ్రైవర్‌లెస్ కారు ఇప్పటికే 30 లక్షల మైళ్లు తిరిగేసింది. ఏకంగా 500 కార్లను పరీక్షిస్తున్న గూగుల్ కొన్ని చోట్ల ప్రయాణికులను ఎక్కించుకుని కూడా పరీక్షించడానికి ప్రయత్నాలు ప్రారంభించింది. 'మేము మంచి కారు తయారుచేయాలని కాదు, మంచి డ్రైవర్ని తయారుచేయాలని ప్రయత్నిస్తున్నాం...' అని ప్రకటించారు వేమో సీఈవో జాన్ క్రాఫ్సిక్. మరో పక్క ఉబర్ సరైన ప్రణాళిక, సాంకేతికత లేక చతికిలబడడమే కాక అంతర్గత సమస్యలతోనూ పోరాడుతోంది. వేమో నుంచీ టెక్నాలజీ చౌర్యం తాలూకు కేసునూ ఎదుర్కొంటోంది. ఇక మెర్సిడెస్ బెంజ్ మాతృ సంస్థ డైమ్లర్ జర్మనీ సరఫరాదారు బాష్‌తో ఒప్పందం కుదుర్చుకుంది. ఈ ఒప్పందం లక్ష్యం ఏమిటంటే 2021 నాటికి పూర్తి స్థాయి అటానమస్ కారుని రోడ్డుమీద ప్రవేశపెట్టడం. నిస్సాన్ అయితే ఏకంగా నాసాతో సహా పలు సంస్థల నుంచి సహకారం తీసుకుంటోంది. మరోపక్క కొత్తగా ఆటోమొబైల్ రంగంలోకి అడుగిడిన టెరాఫుజియా ఏకంగా ఎగిరే కారులోనూ అటానమస్ సాంకేతికతే వాడతానంటోంది.



### ఇంటెల్ ఎందుకొచ్చిందంటే...

సెల్ఫ్ డ్రైవింగ్ కారు



## ఎగిరే కారు వచ్చే ఏడాదేనట!

**2018కల్లా ఎగిరే కారుని మార్కెట్లోకి తేవడానికి డచ్ కంపెనీ పిఎఎల్-వి ఇంటర్నేషనల్ బివి, స్లావేకియాకి చెందిన ఏరో మొబిల్, అమెరికా కంపెనీ టెరాఫుజియా లాంటివి పోటీ పడుతున్నాయి. ఇప్పటికే మార్కెట్లో బుకింగులు కూడా ప్రారంభించాయి. అన్ని రకాల అనుమతులూ పొందాయి. తాజాగా వాటి సరసన జపాన్ కంపెనీ టొయోటా కూడా చేరింది. 2020 టోక్యో ఒలింపిక్స్‌లో తమ ఎగిరే కారు సాయంతో క్రీడాజ్యోతి వెలిగించాలన్న లక్ష్యంతో పని ప్రారంభించింది టొయోటా. కారుగానూ, విమానంగానూ ఉపయోగపడే ఫ్లయింగ్ కార్లు 'పిఎఎల్-వి వన్', టెరాఫుజియా 'ట్రాన్సిషన్'ల రంగప్రవేశానికై ఇప్పటికే మార్కెట్ ఎదురు చూస్తోంది. తమ ఎగిరే కారుకి స్వయంచోదక సాంకేతికతను కూడా జతచేసి మరింత సురక్షితం చేసే ప్రయత్నాల్లో ఉంది టెరాఫుజియా. అతి తక్కువ సమయంలో ఆధునిక సాంకేతికతలో దూసుకుపోతున్న ఈ సంస్థను కొనేందుకు చైనాకి చెందిన ప్రముఖ వాహన తయారీ సంస్థ గీలీ చర్చలు జరుపుతోంది. వాహన తయారీ సంస్థలు స్వయం చోదక కార్ల తయారీపై చూపిన ఆసక్తి ఫ్లయింగ్ కార్లపై చూపడం లేదని ఇప్పటివరకూ భావిస్తూ వచ్చారు. అలాంటిది ఇప్పుడు ఆ దిశగానూ కృషి జోరందుకున్నట్లే కన్పిస్తోంది.**



తయారీకి వాహనతయారీ సంస్థలు ముందుకొచ్చాయంటే అర్థముంది. కానీ కంప్యూటర్ చిప్‌లు తయారుచేసే ఇంటెల్ సంస్థకి కార్లతో ఏం పని అనుకోవచ్చు. కానీ విషయమేంటంటే... అటానమస్ కారు అంటేనే పూర్తిగా సాఫ్ట్‌వేర్‌పై ఆధారపడేది. ఈ కార్లకైతే ఇంటెల్ తన సాఫ్ట్‌వేర్, హార్డ్‌వేర్ రెండిటినీ అమ్ముకోవచ్చు మరి! అందుకే కొంతకాలంగా ఈ రంగంపై దృష్టిపెట్టిన ఇంటెల్ ఇటీవలే ఇజ్రాయెల్‌కు చెందిన మొబిలై సంస్థను 15.3 బిలియన్ డాలర్లకు కొనుక్కోవడానికి ఒప్పందం కుదుర్చుకుంది. ఇంటెల్ చూస్తున్న మరో అవకాశం ఏమిటంటే... ఈ సెల్ఫ్ డ్రైవింగ్ కార్లన్నిటినీ అనుసంధానించడానికి డేటా కేంద్రాల అవసరం ఉంటుంది. అది చాలా పెద్ద మార్కెట్‌గా ఇంటెల్ లెక్కలేస్తోంది. 2030 నాటికి ఈ డేటా కేంద్రాల మార్కెట్ 40 బిలియన్ డాలర్ల వరకూ ఉంటుందని అంచనా. ఈ నేపథ్యంలో ఇంటెల్ మొబిలైను ఎంచుకోవడానికి కారణం... సెల్ఫ్‌డ్రైవింగ్ టెక్నాలజీకి అవసరమైన విడి భాగాల తయారీలో అనుభవం, ప్రపంచంలోని వాహన తయారీ సంస్థలన్నిటితోనూ సంబంధాలుండడం.

### *సింగపూర్ సై...*

స్వయం చోదక కార్ల విషయంలోనూ సింగపూర్ తన ప్రత్యేకత నిలుపుకొంది. అక్కడ ఈ కారులో ప్రయాణికులు తిరుగుతున్నారు కూడా. దేశంలోని 'వన్-నార్త్' అనే ప్రాంతంలో ఆరున్నర కిలోమీటర్ల పరిధిలో ఎంచుకున్న రహదారుల్లో కొద్ది దూరాల మధ్య గత ఏడాది ఆగస్టులోనే ప్రయాణికులను చేరవేయడం మొదలెట్టారు. అమెరికాకి చెందిన న్యూటోనమీ సంస్థ అభివృద్ధి చేసిన లెవెల్ 4 సాంకేతికతను ఈ కారుల్లో వినియోగిస్తున్నారు. కారులో అత్యవసర పరిస్థితిలో ఉపయోగపడడానికి డ్రైవరుతో పాటు కంప్యూటర్లను నిరంతరం పరిశీలిస్తూ మరో వ్యక్తి ఉంటాడు. మరో ఇద్దరు ప్రయాణికులను ఎక్కించుకుని రెండు మూడు మైళ్ల దూరంలో దించుతుంది ఈ కారు. స్వయం చోదక కార్ల సాంకేతికతకి గాను ప్రపంచ ఆర్థిక వేదికపై 'టెక్నాలజీ పయొనీర్ 2017' గుర్తింపు పొందిన న్యూటోనమీ 2018 కల్లా పూర్తి స్థాయి అటానమస్ సాంకేతికతను వాడుకలోకి తెస్తామంటోంది. అందుకుగాను వేర్వేరు కార్ల కంపెనీలతో ఈ సంస్థ ఒప్పందాలు కుదుర్చుకుంది. సెల్ఫ్ డ్రైవింగ్ కార్ల ప్రయోగాలకు సింగపూర్ అనుకూలమనీ, అటానమస్ కార్లు పూర్తిస్థాయిలో వాడుకలోకి వస్తే సింగపూర్ రోడ్ల మీద కార్ల సంఖ్య 9 లక్షల నుంచి 3 లక్షలకు పడిపోతుందనీ ట్రాఫిక్ సమస్యలు తీరుతాయనీ అక్కడి ప్రభుత్వం భావిస్తోంది.

### *వాటంతటవే... ఎలా!?*

రోడ్డుమీద వాహనం నడపాలంటే ఒళ్లంతా కళ్లు చేసుకుని ఏ పక్కనుంచి ఎవరు దూసుకొస్తారోనని చూసుకుంటూ అప్రమత్తంగా ఉండాలి. అలాంటిది ఎవరి సాయమూ లేకుండా ఓ వాహనం దానంతటది ఎలా ప్రయాణిస్తుంది అవరోధాలను ఎలా దాటుతుంది అంటే... సెల్ఫ్ డ్రైవింగ్ కార్లకు ప్రధాన ఆధారం మ్యాప్‌లే. రహదారుల అణువణువునూ పకడ్బందీగా చిత్రించిన మ్యాప్‌ల ఆధారంగా జీపీఎస్‌తో రూపొందించే సాఫ్ట్‌వేర్ ఈ కార్లలో ఉంటుంది. సాంకేతికత వీటిలో ఆకర్షణీయమైన అంశమైతే భద్రత ప్రధానాంశం కానుంది. ఎందుకంటే... డ్రైవర్ల తప్పిదాల కారణంగా రోడ్డు ప్రమాదాలు నానాటికీ పెరుగుతున్నాయి. ఏకాగ్రత, అప్రమత్తత లోపించడం, గంటల తరబడి పనిచేసి కారు నడుపుతూ నిద్ర పోవడం, మద్యపానం చేసి కారు నడపడం, డ్రైవ్ చేస్తూ ఫోను వాడడం... ఇలాంటి కారణాల వల్ల ప్రమాదాలు పెరగడం అన్నిదేశాల్లోనూ కన్పిస్తున్నదే. ఈ కార్ల వల్ల అలాంటి ప్రమాదాలేవీ జరగవు. వీటిల్లో ఉన్న రాడార్లు, సెన్సార్ల వల్ల మనుషులూ ఇతర వాహనాలే కాదు, చిన్న పక్షి అడ్డమొచ్చినా కారు ఆగి తప్పుకొని వెళ్తుంది తప్ప దేన్నీ ఢీకొట్టదు. కాబట్టి ప్రమాదాలు గణనీయంగా తగ్గుతాయన్న ఆలోచన ఈ కార్ల తయారీని ప్రోత్సహించడానికి ప్రధాన కారణం. సమన్వయంతో కూడిన ట్రాఫిక్ వల్ల రహదారులపై రద్దీ తగ్గి వాహనకాలుష్యం సైతం తగ్గుతుంది. అందుకే అన్ని దేశాలూ వీటిని ప్రోత్సహిస్తున్నాయి.

మన దేశానికి వస్తే... అటానమస్ కార్ల అభివృద్ధికి టాటా గ్రూపు ప్రయత్నిస్తోందని ఆ మధ్య వార్తలు వచ్చాయి కానీ సంస్థ అధికారికంగా ప్రకటించలేదు. అయితే తమ కార్లను ఇక్కడ పరీక్షించుకోవడానికి గూగుల్, ఉబర్ లాంటి సంస్థలకు అనుమతివ్వడానికి భారత ప్రభుత్వం సుముఖంగా ఉంది. క్రమశిక్షణ గల ట్రాఫిక్, పూర్తిస్థాయిలో రోడ్ల మ్యాపింగ్, శక్తిమంతమైన అంతర్జాల సదుపాయం... ఈ కార్ల పరీక్షకు అత్యవసరమైన అంశాలు. కాబట్టి ముందుగా ఆ మౌలికావసరాలను అభివృద్ధి చేస్తే... మన నగరాల్లోనూ అటానమస్ కార్లను చూడవచ్చన్నమాట.

కారు నడిపే సమయం కలిసి రావాలి... సురక్షితంగా గమ్యం చేరాలి.

ఆశయం స్పష్టం, సృజనాత్మకత పుష్కలం, సాంకేతికత సిద్ధం.

అందుకే... డ్రైవరు లేని కారులో రోడ్డు మీదో, ఎగిరే కారులో ఆకాశంలోనో షికారుకెళ్లే రోజు ఎంతో దూరం లేదు మరి!








ఓయో రూమ్స్, హైక్, ఓలా, స్నాప్‌డీల్, హౌసింగ్, పేటీఎం, గ్రోఫర్స్... కొన్నేళ్లుగా దేశ మార్కెట్‌లో దూసుకెళ్తున్న స్టార్టప్‌లివి. తమ సేవల్ని ఆదరిస్తున్నందుకు ప్రజలకే కాదు, జపాన్ వ్యాపార దిగ్గజం మసాయోషి సన్‌కి కూడా ఈ సంస్థ యజమానులంతా రుణపడి ఉంటారు. ఇలాంటి పేరున్న ఎన్నో భారతీయ సంస్థల్లో తొలి దశలో పెట్టుబళ్లు పెట్టి ముందుకు నడిపించింది ఆయనే మరి.

# కుర్రాళ్లకి రూ.6.5లక్షల కోట్లు!

రూ.25వేల కోట్లు... ఇప్పటిదాకా జపనీస్ సంస్థ 'సాఫ్ట్ బ్యాంక్' భారతీయ కంపెనీల్లో పెట్టిన పెట్టుబడుల విలువ. రూ.65వేల కోట్లు... దేశంలో ఆ సంస్థ మొత్తంగా పెట్టనున్న పెట్టుబడుల విలువ. దేశంలోని ఇన్వెస్టర్ల నుంచి నిధులు సమకూర్చుకోవడానికి భారతీయ సంస్థలు తంటాలు పడుతున్న సమయంలో, జపాన్ సాఫ్ట్‌వేర్ దిగ్గజం మసాయోషి సన్ తానున్నానంటూ ముందుకొచ్చారు. ఇక్కడి కుర్రాళ్ల నైపుణ్యం, సామర్థ్యం మీద అపార నమ్మకంతో తన దేశం కాకపోయినా వేల కోట్ల రూపాయలను సమకూర్చడానికి సిద్ధమయ్యారు. దేశ స్టార్టప్‌ల రంగంలో తమదైన ముద్రవేస్తూ ఓయో, పేటీఎం, హౌసింగ్, హైక్ లాంటి ఎన్నో సంస్థలు దూసుకెళ్తున్నాయంటే, దానికి ఎంతోకొంత తన 'సాఫ్ట్‌బ్యాంక్' ద్వారా సన్ పెట్టిన పెట్టుబడులే కారణం.

★ జపాన్‌లోని అత్యంత సంపన్నుల్లో సన్ ఒకరు. ప్రపంచంలోని అతిపెద్ద టెలికాం రంగ సంస్థల్లో ఆయనకు చెందిన 'సాఫ్ట్ బ్యాంక్' ఒకటి. ఆ సంస్థ ద్వారా లాభాలు అందుకుంటున్నా, ఆ ఆదాయం మళ్లీ పది మందికీ ఉపయోగపడాలన్నది సన్ ఆశ. అందుకే 'సాఫ్ట్‌బ్యాంక్ క్యాపిటల్' పేరుతో కొంత నిధిని ఏర్పాటు చేసి పదిహేనేళ్ల క్రితం నుంచే జపాన్‌లోని చిన్న చిన్న స్టార్టప్‌లలో పెట్టుబడి పెట్టడం మొదలుపెట్టారు. ఆ తరవాత వాటిని చైనా, అమెరికా, భారత్ లాంటి ఇతర దేశాలకూ సన్ విస్తరించారు.

★ ఒకటీ రెండూ కాదు, ప్రపంచవ్యాప్తంగా రెండొందలకుపైగా సంస్థల్లో సన్‌కి వాటాలున్నాయి. ఆ సంస్థలు కష్టాల్లో ఉన్నప్పుడూ, వాటికి నిధులు అవసరమైనప్పుడూ సన్ ఆదుకున్నారు. వాటి అభివృద్ధిని అందరికంటే ముందే అంచనా వేసి వేల కోట్ల రూపాయల్ని అందించారు. ఓలా, హౌసింగ్, ఓయో, ఇన్‌మొబీ లాంటి భారతీయ సంస్థలే కాదు, ప్రపంచవ్యాప్తంగా గుర్తింపు తెచ్చుకున్న అలీబాబా, బజ్‌ఫీడ్, హఫింగ్టన్ పోస్ట్, యాహూ లాంటి అనేక పేరున్న కంపెనీలు తొలిరోజుల్లో సాఫ్ట్‌బ్యాంక్ సాయంతోనే నిలదొక్కుకున్నాయి. ప్రపంచాన్ని మార్చే శక్తి టెక్నాలజీకి మాత్రమే ఉందన్నది సన్ నమ్మకం. అందుకే ఇరవై ఏళ్లుగా కొత్త సాంకేతికతతో ముందుకొచ్చే సంస్థల్లోనే ఆయన పెట్టుబడులు పెడుతున్నారు.

★ రాబోయే రోజుల్లో ప్రపంచవ్యాప్తంగా మంచి భవిష్యత్తున్న టెక్ కంపెనీల్ని గుర్తించి వాటికి పెట్టుబడులు సమకూర్చాలని సాఫ్ట్ బ్యాంక్ నిర్ణయించింది. దానికోసం ఏకంగా ఆరు లక్షల యాభై వేల కోట్ల రూపాయలతో 'విజన్ ఫండ్' పేరుతో సన్ ఓ నిధిని ఏర్పాటు చేశారు. ఇప్పటిదాకా ప్రపంచంలో ఇదే అత్యధిక స్టార్టప్ ఫండ్. అందులో పదో వంతు అంటే దాదాపు అరవై ఐదు వేల కోట్ల రూపాయలను భారతీయ కంపెనీలకే అందించాలని ఆయన నిర్ణయించారు. చెప్పినట్టుగానే ఇప్పటికే దాదాపు పాతిక వేల కోట్ల రూపాయలను మంచి స్టార్టప్‌లు పెట్టిన మన కుర్రాళ్లకు అందించారు. ఈ మధ్యే అత్యధికంగా దాదాపు రూ.9వేల కోట్లను పేటీఎంకు సమకూర్చారు. ఓలాకి రూ.2వేల కోట్లు, గ్రోఫర్స్‌కి రూ.770 కోట్లు, హౌసింగ్.కామ్‌కి రూ.700 కోట్లు, ఓయో రూమ్స్‌కి రూ.643 కోట్లు... ఇలా వందల కోట్ల రూపాయలను ఆయన భారతీయ స్టార్టప్‌ల చేతిలో పెట్టారు.

★ భవిష్యత్తులోనూ సాఫ్ట్‌బ్యాంక్ నుంచి భారత్‌కు పెట్టుబడుల వర్షం కురిసే అవకాశాలు పుష్కలం. దానికి కారణం సాఫ్ట్‌బ్యాంక్ విజన్ ఫండ్‌కి సీయీవోగా వ్యవహరిస్తున్న రాజీవ్ మిశ్రా అనే భారతీయుడు. వ్యాపార రంగంలో 'క్రియేటివ్ జీనియస్'గా పేరున్న మిశ్రా ఐఐటీ దిల్లీ పట్టభద్రుడు. 'నేను పని చేసేది విదేశీ సంస్థకైనా, దానివల్ల నేరుగా దేశానికి సాయపడే అవకాశం దొరికింది' అంటాడు మిశ్రా. ఆయన ఉన్నన్నాళ్లూ భారత్‌లో సాఫ్ట్‌బ్యాంక్ పెట్టుబడులకు ఢోకా లేదన్నది ఇన్వెస్ట్‌మెంట్ నిపుణుల అంచనా.

★ తాను పెట్టుబడులు పెట్టిన సంస్థలను పరిశీలించడానికి గతేడాది భారత్‌కి వచ్చిన సన్, ప్రధాని మోదీతో మాట్లాడినప్పుడు 'క్లీన్ ఎనర్జీ' రంగంలో ప్రభుత్వం చూపిస్తున్న ఆసక్తి గురించి తెలుసుకున్నారు. దాంతో తన వంతుగా భారత్‌లో కాలుష్యాన్ని తగ్గించే ప్రయత్నం చేస్తానని ప్రధానికి మాటిచ్చారు. చెప్పినట్టుగానే మరో సంస్థతో కలిసి మొదట ఆంధ్రప్రదేశ్‌లోని కర్నూలు జిల్లాలో 350మెగావాట్ల సౌర విద్యుత్ ప్లాంట్‌ని సాఫ్ట్‌బ్యాంక్ నిర్మించింది. నిర్దేశిత గడువుకంటే యాభై రోజుల ముందుగానే అది పూర్తయి, వినియోగంలోకి వచ్చింది. కాలుష్యాన్ని తగ్గించేందుకు మరో ప్రయత్నంగా తాను ప్రధాన పెట్టుబడిదారుగా ఉన్న ఓలా క్యాబ్స్‌ని రానున్న రోజుల్లో పూర్తిగా ఎలక్ట్రిక్ కార్లతో నడిపించాలనుందని సన్ చెప్పారు. 'మేకిన్ ఇండియా'లో భాగంగా ఆ కార్లను కూడా భారత్‌లోనే తయారు చేయడానికి ప్లాంట్ ఏర్పాటు చేస్తానని అన్నారు. ఇచ్చిన మాట ప్రకారం ఇప్పటికే పైలట్ ప్రాజెక్టు కింద కొన్ని ఓలా ఎలక్ట్రిక్ కార్లను హైదరాబాద్ నుంచే మొదలుపెట్టడం విశేషం. పరిస్థితులు అనుకూలిస్తే రాబోయే రోజుల్లో భారత్‌లోని ఓలా డ్రైవర్లకు పదిలక్షల ఎలక్ట్రిక్ కార్లను ఉచితంగా ఇవ్వాలన్నది సన్ కోరిక. ఇప్పటికే మన వ్యాపారాల్లో, అభివృద్ధిలో భాగమైన సన్, మన పర్యావరణానికీ మేలు చేయాలనుకోవడం గొప్ప విషయమే! ★



**కథ**

# మనిషి మరణించలేదు

**- జంధ్యం వెంకటేష్ బాబు**

**నా**న్న అప్పటికి హాస్పిటల్‌లో జాయినై వారంరోజులైంది. లివర్ పూర్తిగా పాడైపోయింది. మరో రెండు మూడు రోజులు మించి బతకరని డాక్టర్లు తేల్చేశారు.

మొదటి రెండురోజులు ఆ ఐసీయూ గదిలోకి వెళ్ళడానికి నాకు ఇబ్బందిగా అనిపించలేదు. కానీ, నాన్నకు నేను ప్రామిస్ చేశాక, ఇప్పుడు ఆ గదిలోకి వెళ్ళాలంటే మాత్రం భయమేస్తోంది. కానీ తప్పదు. మెల్లగా ఆ గదిలోకి వెళ్ళాను.

ఆ స్థితిలోనూ నాన్న నావంక బేలగా చూశారు. ఆయన కళ్ళల్లో ఒక్కటే ప్రశ్న- 'నువ్వు చేయగలవా?'

పెదవులు బిగబట్టాను. 'మాట ఇచ్చినప్పుడు చాలా సులభం అనిపించింది... ప్రయత్నం ప్రారంభించగానే ఎంత కష్టమో అర్థమైపోయింది...చేయగలనన్న నమ్మకం నాకు మెల్లగా తగ్గిపోతోంది.'

'మరో రోజో... రెండురోజులో..! నేనెంతో ఇష్టపడే నాన్న- నన్ను... ఊహు... ఈ లోకమే వదిలి వెళ్ళిపోతారు.'

డాక్టర్లు ఆ విషయం తేల్చి చెప్పేశారు.

నాన్న నాకు జీవితంలో అన్నీ సమకూర్చి ఇచ్చారు. కానీ, ఏనాడూ ఏదీ అడగలేదు. చనిపోతానని తెలిశాక ఒక్క కోరిక... ఒకే ఒక్క కోరిక కోరారు.

"ఏరా నవీన్, నేను చనిపోతే నా శవాన్ని, మీ అమ్మ సమాధి పక్కనే ఖననం చేయగలవా?"

అది ఆయన కోరినప్పుడు చాలా చిన్న కోరికలా అనిపించింది. అందుకే దానికి పెద్ద ప్రాధాన్యం ఇవ్వకుండా "అలా అనకు నాన్నా... మీకేం కాదు" అంటూ తనకు బతుకు మీద భరోసా ఇచ్చే ప్రయత్నం చేశాను.

"నాకు ఇప్పుడేమవుతుందో, రేపేమవుతుందో నన్న భయం లేదురా... ఎప్పుడు, ఎలా జరిగినా చివరికి అక్కడికి చేరుకోవాలనే కోరిక మాత్రమే మిగిలింది. నేను వెళ్ళిపోయాక నాకేం కావాలో నిన్నడుగుతున్నాను... నాకు కావలసింది చేయగలవా?"

"తప్పకుండా చేస్తాను నాన్నా."

మూడురోజుల క్రితం నాన్నకు మాటిచ్చాను.

మర్నాటి నుంచీ ఆయన నన్ను మరింత పరిశీలనగా చూడటం మొదలుపెట్టారు. రెండో రోజు నా ముఖంలో నిరాశ కదలాడటం ఆయన గమనించినట్టున్నారు. అందుకే అడిగేశారు "నేను అడిగింది చేయగలవా?"

"ఆ ప్రయత్నంలోనే ఉన్నాను నాన్నా."

ఆయనకు విషయం కొంతవరకూ అర్థమైనట్టుంది. మౌనంగా ఉండిపోయారు. కానీ, నాకేసి ఆర్తిగా చూడటం మానలేదు.

ఒకవైపు ప్రాణాలు పోబోతున్నాయని తెలుస్తూనే ఉంది. మనిషి అప్పుడప్పుడు అపస్మారకంలోకి వెళ్ళి పిచ్చిపిచ్చిగా మాట్లాడుతూనే ఉన్నారు. కానీ, కాసింత తెలివి వచ్చినా, నాకేసి అలా ప్రశ్నకు జవాబు కోసమే ఎదురుచూస్తున్నారు.

ఐసీయూలో నుంచి నెమ్మదిగా బయటకు నడిచాను. కారిడార్‌లో నా కోసమే ఎదురు చూస్తున్న ప్రమద్వర నా ముఖం చూసి అడిగింది "ఏంటీ, ఆయన అడిగినదాని గురించే ఆలోచిస్తూ బాధపడుతున్నారా?"

అవుననూ కాదూల మధ్య తలాడించాను.

ప్రతి సమస్యకూ ఓ పరిష్కారం ఉంటుందన్నట్టు ఆమె అంది... "చేస్తానన్నారు కదా... చేస్తాననే చెప్పండి. అదే భ్రమలో ఆయనను పోనివ్వండి. పోయాక ఏం జరిగిందన్నది ఆయనకు తెలియదు కదా! మనం ఆ దహన సంస్కారాలేవో ఇక్కడే చేద్దాం."

నేను మా ఆవిడకేసి నిరాభావంగా చూశాను. మనుషుల్ని మోసం చేయడం అలవాటైపోయింది. చివరికి శవాలను కూడా మోసం చేయడం!?

నేనేం మాట్లాడకపోయేసరికి తను కాస్త ఈసడింపుగా తల పక్కకు తిప్పుకుని తన పిల్లల దగ్గరకెళ్ళి అక్కడే ఉన్న కుర్చీలో కూర్చుండిపోయింది.

నిన్నటి నుంచీ చేసిన నా ప్రయత్నాలను గుర్తుచేసుకుంటూ అలా నిలబడిపోయాను.

★ ★ ★

విన్నప్పుడు చాలా చిన్న విషయంలా అనిపించింది... శవాన్ని ఓ పల్లెకు చేర్చి ఆయన కోరుకున్న చోట పూడ్చిపెట్టడం!

అది నాన్న మాస్టారుగా ఉద్యోగం చేసిన ఊరు. నేను పుట్టి పెరిగిందీ ఆ పల్లెలోనే! ఆరేళ్ళక్రితం వరకూ నాన్న, అమ్మతో కలసి ఆ ఊళ్ళోనే ఉండేవారు. అమ్మ చనిపోయాక తనను ఒంటరిగా ఉంచడం ఇష్టంలేక హైదరాబాద్ తీసుకొచ్చేశాను.

ఆ ఊరు సిటీకి ఆరువందల కిలోమీటర్ల దూరంలో ఉంది.

అంబులెన్స్‌లో ఆ ఊరికి శవాన్ని తీసుకెళ్ళడం పెద్ద కష్టం కాదు. కానీ, శవాన్ని తిన్నగా స్మశానానికి తీసుకెళ్ళలేం. అలా చేయకూడదని శాస్త్రం చెబుతోంది. ఏదో ఇంట్లో దించి అక్కడినుండి ఊరేగింపుగా శ్మశానానికి తీసుకెళ్ళాలి.

ఒకప్పుడు ఆ ఊళ్ళో మాకు బంధుమిత్రులు ఎక్కువగానే ఉండేవారు. కానీ నేను హైదరాబాద్ వచ్చేశాక వాళ్ళతో రిలేషన్స్ మెయిన్‌టైన్ చేయలేకపోయాను. అందులోనూ దూరపు వరసైనా... పెదనాన్న, పిన్ని అంటూ వరుసలు కలిపి ఆప్యాయంగా మాట్లాడుకున్న ఆ తరం వాళ్ళు వెళ్ళిపోయారు. ఇప్పుడు పొరుగింటితో కూడా సంబంధం అవసరంలేదనుకుని టీవీ, మొబైల్ ఫోన్‌లతో గడిపే మనుషులు ఎక్కువైపోయారు. ఇలాంటి పరిస్థితిలో శవాన్ని తమ ఇంటినుండి సాగనంపేవాళ్ళెవరు!?

ఆ ఊళ్ళో నాకున్న బంధుమిత్రులను గుర్తు చేసుకున్నాను. వాళ్ళలో నాకు మొదటగా గుర్తొచ్చింది... మా బాబాయి కొడుకు వీరమోహన్.

ఈమధ్య కాలంలో వాడికి కనీసం ఫోన్ కూడా చేయలేదు. రెండేళ్ళక్రితం వాళ్ళ అమ్మాయి పెళ్ళికి పిలవడానికి వచ్చాడు. బాగా బిజీగా ఉండటంతో పెళ్ళికి వెళ్ళలేకపోయాను. బిజీ... మనుషులతో అనుబంధాలను కాపాడుకోవడం కన్నా ఇతరత్రా బిజీలు మనిషికి ఎక్కువైపోయాయి. నేనూ అందుకు అతీతుణ్ణి కాను.

అందుకే వాడికి ఫోన్ చేయాలంటే కాస్త ఇబ్బందిగా అనిపించింది. కానీ తప్పదు కాబట్టి చేశాను. "నాన్న ఒకే ఒక ఆఖరి కోరిక చెప్పి తన మరణానంతరం అక్కడికి తీసుకొస్తా నన్నాను. మీ ఇంటి నుంచి నాన్నను సాగనంపుదాం" అని అడిగాను.

"ఒక అరగంట ఆగి ఫోన్ చెయ్యి" అన్నాడు వాడు.

అరగంటాగి ఫోన్ చేశాక, అప్పటికే కుటుంబ సభ్యులతో మాట్లాడాడేమో, విషయం వివరించాడు. "సారీ అన్నయ్యా, ఈ వారంలోనే మా పెద్దమ్మాయీ, అల్లుడూ ఆస్ట్రేలియా నుంచి వస్తున్నారు. వాళ్ళు ఇంట్లో ఉన్నప్పుడు ఈ కార్యక్రమం అంటే బాగా ఇబ్బందిగా ఉంటుంది అంటున్నారు. అందులోనూ అమ్మాయికి సంవత్సరం బాబు... ఏమనుకోకు" అన్నాడు.

జీవితంలో ఏ విషయంలోనూ తిరస్కారం భరించలేనిస్థితి నాదని నా ఉద్దేశం. నన్ను నేను కంట్రోల్ చేసుకుంటూ దీర్ఘంగా విశ్వసించాను.

తిరస్కారం తాలూకు అవమానాన్ని మించిన భయం మొదటిసారి కలిగింది. నేను సులభంగా చేయగలననుకున్నది చేయడం చాలా కష్టమా? ఆ ఊళ్ళో వాడొక్కడే కాదు...నేను పుట్టి పెరి



గిన ఊళ్ళో నాన్నను తమ ఇంటినుంచి స్మశానానికి సాగనంపడానికి నాకంటూ ఎవరూ లేరా? ఆలోచించసాగాను... ఇలా ఆలోచించవలసిన అవసరం చాలామందికి రాదేమో! ఒక్కసారి ఆలోచిస్తే, అంచనా వేస్తే మనకంటూ ఎవరైనా మిగిలి ఉన్నారో లేదో అర్థమవుతుంది.

అలా ఆలోచిస్తుంటే నాకు నా ఫ్రెండ్ రఘు గుర్తుకొచ్చాడు.

మా నాన్నను వాడి ఇంటినుంచి స్మశానానికి సాగనంపడానికి వాడు ఒప్పుకుంటాడనే అనుకున్నాను.

వాడికి ఫోన్ చేసి విషయం చెప్పాను.

వాడు 'సారీ' అంటూ, అలా అనడానికి గల కారణాలు వివరించాడు- "ఒక ఇంటినుంచి శవాన్ని తరలిస్తే ఆ ఇంటికి అంటిన మైల శుద్ధి చేయాలి. పంతులుగారి చేత శాంతిపూజలు చేయించాలి. అంతేకాదు, శవాన్ని తరలించేటప్పుడు వెలిగించిన దీపం పెద్దకర్మ వరకూ వెలుగుతుండాలి. పెద్దకర్మ కూడా ఆ ఇంటిలోనే చేయాలి. ఇదంతా చాలా కష్టం నవీన్."

సాటిజీవిని ఇష్టంగానైనా, కష్టంగానైనా భరించగలిగే మనిషి, పార్థివదేహాన్ని ఏవిధంగానూ భరించలేడన్న నిజం నాకర్థమయింది.

చాలా బాధగా అనిపించింది. బాధకన్నా కర్తవ్యం నన్ను భయపెట్టసాగింది.

ఎలా..? ఎలా..?

★ ★ ★

ఆయన బేలచూపులే నాకు గుర్తుకొస్తున్నాయి.

ఎంతో గొప్ప స్థితిలో ఉన్నాననుకున్న నేను, నాన్న కోరిన ఆఖరి చిన్న కోరికను తీర్చలేకపోవడమా?... బాధగా ఉంది...భయమేస్తోంది... నామీద నాకే జాలి కలుగుతోంది.

అలా ఆలోచిస్తుంటే రామ్మోహన్ గుర్తుకొచ్చాడు. తను నాకు క్లాస్‌మేటేగానీ ఎప్పుడూ అంత క్లోజ్‌గా ఉండలేదు. కాకపోతే తను సేవా కార్యక్రమాలలో చురుగ్గా ఉంటాడని తెలుసు.

రామ్మోహన్‌కి ఫోన్ చేశాను. ఒక విధంగా అతడిని బ్రతిమలాడుకుంటున్నట్టుగా మాట్లాడాను. "ఇది నాన్నగారి ఒకే ఒక కోరిక రామ్మోహన్! చాలా చిన్న కోరికే అనుకున్నాను. కానీ, అది చాలా పెద్ద కోరిక అనీ, నా శక్తికి మించినదనీ ఇప్పుడిప్పుడే తెలుస్తోంది. మర్చిపోయిన పుట్టిన ఊరి మట్టిలో కలవడం ఎంత కష్టమో అర్థమవుతోంది. ఇందులో నాన్న తప్పేంలేదు. నేనే బలవంతంగా ఆ ఊరితో ఆయనకు సంబంధాలు తెంచేశాను. ఇల్లు అమ్మేద్దన్నా, 'మనం ఆ ఊరు వెళ్తామా ఏంటి?' అంటూ అవసరంలేకున్నా ఇంటిని అమ్మేశాను. కొత్త రిలేషన్స్ మధ్య పాత బంధుమిత్రులను పట్టించుకోవటం మానేశాను. ఇప్పుడు ఆ పల్లె జ్ఞాపకాలే తప్ప ఏవిధమైన బంధం లేకపోయింది. చివరికి నాన్నను సంప్రదాయబద్ధంగా సాగనంపడానికి కూడా అవకాశం లేకుండా పోయింది."

నా మాటకు వాడు కదిలిపోయినట్టున్నాడు. "సరే, ఓ పని చేస్తాను. ఊరి ప్రెసిడెంట్‌ని అడిగి కాసేపు శవాన్ని పంచాయితీ ఆఫీసులో ఉంచుదాం. అక్కడినుంచి లాంఛనాలతో... అదే పాడె కట్టి ఊరేగింపుగా శ్మశానానికి తీసుకెళ్దాం."

అంతకుమించి మరోమార్గం లేదు. ప్రముఖ నాయకులను పార్టీ కార్యాలయంలో కాసేపు ఉంచినట్టు... అలా ఆయనను సాగనంపాలి.

తను కోరుకున్న చోటుకు చేరబోతున్నానని ఎలా తెలిసిందో... అరగంట తర్వాత డాక్టర్ మా దగ్గరకు వచ్చి డెత్ కన్‌ఫర్మ్ చేశాడు.

★ ★ ★

అంబులెన్స్ పల్లెను సమీపిస్తోంది.

వెనుకే కారులో నా కుటుంబంతో నేను ఫాలో అవుతున్నాను.

హైదరాబాద్‌లో ఉన్న నా సర్కిల్ నుంచి ఫోన్స్ వస్తూనే ఉన్నాయి.

"ఇప్పుడే విషయం తెలిసింది... ఎలా జరిగింది? సారీ, అంత దూరం రాలేకపోతున్నాను. ఇక్కడికి రాగానే ఇంటికొచ్చి కలుస్తాను."

కమ్యూనికేషన్ పెరిగిన ఈ కాలంలో ఈ తరహా ఓదార్పుకు మించి ఎక్కువ ఆశించడం అత్యాశే!

అంబులెన్స్ పంచాయితీ ఆఫీసు సమీపించింది. అప్పటికే అక్కడ నేను ఎప్పుడూ పట్టించుకోని బంధుమిత్రులు పదిమంది వరకూ ఉన్నారు.

వాళ్ళలో ఒకరిద్దరు అంబులెన్స్ దగ్గరకొచ్చి



ఫ్రీజర్‌ని కిందికి దించడానికి ప్రయత్నిస్తున్నారు.

అప్పుడు...అప్పుడు ముందుకొచ్చాడు...రమేష్!

"ఆగండి..."

అందరం అతడికేసి చూశాం.

"మాస్టార్ని ఇక్కడ దించొద్దు."

"ఎ... ఎందుకని?" నా గొంతు వణికింది.

"ఏ పార్థివ దేహమైనా ఇంటినుంచి లాంఛనాలతో శ్మశానం చేరుకోవాలి. కేవలం అనాధశవాలు మాత్రమే మార్చురీ నుంచో, పంచాయితీ ఆఫీసుల నుంచో శ్మశానానికి చేరుకుంటాయి."

నాలో... భయం, బాధ, దుఃఖం, కోపం కలగలిసిన నిస్సహాయత. 'మా నాన్న దగ్గర చదువుకున్న వీడు... చివరికి ఆయనను అనాధశవంలా కూడా సాగనంపకుండా అడ్డుపడుతున్నాడా?'

నేనేదో అనబోయేంతలో రామ్మోహన్ వాడిని అడిగాడు "అయితే ఇప్పుడేమంటావ్?"

"ఆయన నాకు చదువు చెప్పారు. 'తల్లీ తండ్రీ గురువూ దైవం' అన్నారు. తల్లిదండ్రుల పట్ల ఎంత బాధ్యత ఉంటుందో, గురువు పట్ల కూడా అంత బాధ్యత చూపించడం ధర్మం. అందుకే ఆయన పార్థివ దేహాన్ని మా ఇంటికి తీసుకెళ్ళాలనుకుంటున్నాను."

అక్కడున్న వాళ్ళందరూ వాడికేసి నమ్మలేనట్టు చూశారు.

నాకు మాత్రం అదో అద్భుతంలాగే అనిపించింది. అంతకుమించి 'మనిషి మరణించలేదు' అనుకున్నాను. ఎందుకంటే, ఏ రక్త సంబంధమూ లేకుండా శవాన్ని తన ఇంటినుంచి సాగనంపే మానవత్వం ఎందరికుంటుంది.

శవం రమేష్ ఇంటికి చేరుకుంది.

అప్పటివరకూ పట్టుమని పదిమంది లేరు. కానీ, శవం శ్మశానానికి బయలుదేరగానే ఊరు ఊరంతా వెనుక నడిచొచ్చింది.

నా స్థితీ, హోదాల కారణంగా వారెవరూ రాలేదు.

అది మా నాన్న చేసుకున్న పుణ్యం!

మనిషి బతికుండగా ఇష్టమైన ప్రదేశాలు చూడాలని యాత్రలు చేస్తాడు. కానీ, మరణం సమీపించాక తనకిష్టమైన చోటే తనువు ఆగిపోవాలని ఆశిస్తాడు. అయితే చాలా కొద్దిమందికే ఆ కోరిక తీరుతుంది, తనకత్యంత ఇష్టమైనచోట శాశ్వత విశ్రాంతి తీసుకునే అవకాశం లభిస్తుంది.

మా నాన్న ఆ విధంగా అదృష్టవంతుడు!

★ ★ ★

కర్మకాండలన్నీ పూర్తిచేసుకుని హైదరాబాద్ తిరిగొచ్చాం.

ఆ రాత్రి ప్రమద్వర నా భుజంమీద తల వాల్చి, గుండెల మీద చెయ్యేసింది. ఆ చేతి స్పర్శలో మును పెన్నడూ లేనంత ఆప్యాయత కనిపించింది.

"ఏమండీ..."

"ఊ..."

"నేను చనిపోతే మీరు నన్ను వదిలి వెళ్ళిపోరుగా! అత్తయ్యగారి పక్కన మామయ్య ఉన్నట్టు మీరూ నా పక్కనే ఉంటారుగా..."

ఒక సంఘటన ఎందరికో ఉత్తేజాన్నిస్తుంది. 'నాన్న శవాన్ని అమ్మ దగ్గరకు చేర్చనవసరం లేదన్న' ఆమె, మరణించాక కూడా నాతో కలసి గడపాలనుకుంటోంది.

నేను తనచుట్టూ చేతులేసి "అలాగే" అన్నాను.

★ ★ ★

ఆ రాత్రి నాకో కల వచ్చింది...

అమ్మ నిద్ర లేచింది. పక్కనే పడుకుని ఉన్న నాన్నను నిద్ర లేపుతోంది. "ఏమండీ... ఏమండీ..."

నాన్నకు మెలకువ వచ్చింది. "సారీ జానకీ, శాశ్వత నిద్ర కదా...త్వరగా మెలకువ రాలేదు."

"పరవాలేదులెండి... ఏదో పక్కనే ఉన్నారు కనుక మిమ్మల్ని పిలవగలిగాను... అదే ఎక్కడో దూరంగా ఉంటే ఏం చేసేదాన్ని. ఏదో మన పుణ్యం కొద్దీ ఇద్దరం ఒక్కచోటే ఉండే అదృష్టం దక్కింది."

"మనిద్దరం కలిసే ఇకపై మన పిల్లల్ని దీవించొచ్చు" నాన్న ఆనందంగా అన్నాడు.

వాళ్ళిద్దరూ పక్కపక్కనే కూర్చుని మాట్లాడుకోసాగారు.

నాకు మెలకువ వచ్చింది. మనసంతా ఏదో తెలియని ఆనందం.

అరవై ఏళ్ళు కలసి జీవించి ఆరేళ్ళుగా దూరమైన ఆ తనువులు... ఒకేచోట మట్టిలో కలసిపోవడం... బిడ్డలు తలచుకుంటే సాధ్యమేనేమో!

నాకు జీవితంలో గొప్ప విజయం సాధించిన సంతృప్తి లభించింది. ★

# వహ్వా... వంటల బ్లాగ్!



వృత్తి ప్రవృత్తుల గురించి నలుగురికీ చెప్పుకోవడానికీ, వ్యాపారమైతే ప్రచారం చేసుకోవడానికీ సామాజిక మాధ్యమాలదే ఇప్పుడు కీలక పాత్ర. ఫొటోలూ వీడియోలూ షేర్ చేసే అవకాశం ఉండడంతో ఫేస్‌బుక్‌నే ఎక్కువ మంది ఎంచుకుంటున్నారు. అయితే మనదేశంలో ఇటీవల ఒక సంస్థ అధ్యయనం చేసి ఫేస్‌బుక్‌లో వీక్షకుల ఆదరణను అత్యధికంగా అందుకున్న వీడియోల జాబితాను తయారుచేసింది. ఆశ్చర్యం... అందులో తొలి రెండు స్థానాలనూ వార్తల వెబ్‌సైట్లు గెలుచుకోగా మూడో స్థానంలో నిలిచింది ఓ వంటల వెబ్‌సైట్! ఆ వీడియో బ్లాగ్ యజమాని ఎవరో ఎవరికీ తెలియక పోవడం కొసమెరుపు.

ఫేస్‌బుక్ చూస్తుంటారు... అకస్మాత్తుగా ఓ వీడియో ప్రత్యక్షమవుతుంది. పొయ్యి మీద మూకుడు పెట్టడంతో మొదలుపెట్టి చకచకా రకరకాల పదార్థాలను అందులో వేస్తూ గరిటెతో కలుపుతూ‌ంటుంది ఓ చెయ్యి... పక్కనే ఆంగ్లంలో వేస్తున్న పదార్థం పేరూ మోతాదూ కన్పిస్తుంటాయి. మనమలా చూస్తుండగానే నిమిషంలో నోరూరించే వంటకం తయారై పోతుంది. నేపథ్యంలో సంగీతం మినహా మరేం విన్పించదు. వంటల పట్ల ఏ మాత్రం ఇష్టం లేనివారికి కూడా ఆసక్తి కలిగేలా ఉంటాయి ఆ వీడియోలు. ఫేస్‌బుక్‌లో అత్యంత ఆదరణ పొందిన వీడియోల్లో మూడోస్థానం పొంది పది కోట్ల వ్యూస్ దిశగా సాగిపోతున్న 'హెబ్బార్స్ కిచెన్' విశేషాలు చూద్దామా?

'హెబ్బార్స్ కిచెన్'లో అచ్చంగా సంప్రదాయ దక్షిణ భారత శాకాహార వంటకాలు మాత్రమే ఉంటాయి. ఒక్కో వంటకం గురించీ ఒకటి, రెండు నిమిషాల అతి తక్కువ సమయంలోనే అర్థమయ్యేలా వివరించడమూ, ఆకర్షణీయంగా చూపించడమూ ఈ వీడియోల ప్రత్యేకత. ఇంతగా ఆదరణ పొందుతున్న ఈ వీడియో బ్లాగ్ సొంతదారు ఎవరా అని చూస్తే... ఆ వెబ్‌సైట్లో ఎవరి పేరూ, ఫొటో లేవు. అసలు 'మా గురించి' (ఎబౌట్ అజ్) అన్న కాలమ్ కన్పించదు. దాంతో మరింత ఆసక్తి పెరిగి బ్లాగ్‌లో ఉన్న ఈ మెయిల్ ద్వారా ప్రయత్నించగా తెలిసిన విషయాలివి.

### తెర వెనుకే ఉండి...

ఈరోజుల్లో వంటలకు సంబంధించి బ్లాగులు నిర్వహిస్తున్న చాలామంది సెలెబ్రిటీ హోదాను అనుభవిస్తున్నారు. కానీ హెబ్బార్స్ కిచెన్ నిర్వహిస్తూ అతి తక్కువ సమయంలోనే విపరీత ఆదరణ పొందిన అర్చన మాత్రం తనకు పబ్లిసిటీ ఏమాత్రం ఇష్టం లేదంటారు. ప్రచారం ప్రభావం వ్యక్తిగత జీవితం మీద పడకూడదనే తన ఫొటో ప్రచురించడానికి ఇష్టపడరట ఆమె. ఇంతకీ ఆమె ఎక్కడ ఉండి ఈ బ్లాగ్ నిర్వహిస్తున్నారో తెలుసా? ఆస్ట్రేలియాలో. 'హెబ్బార్' అనేది కన్నడ సంప్రదాయ బ్రాహ్మణుల్లో ఒక శాఖ. ఉడుపి, మంగళూరు ప్రాంతంలో ఉండే వీరు ఆ ప్రాంతంలో పండే కూరగాయలతోనే వివిధ రకాల వంటలు చేసుకుంటారు. అలాంటిది ఆస్ట్రేలియాలో ఉండీ ఈ వంటల ప్రత్యేకతను ఆమె ఎలా ప్రతిబింబించగలుగుతున్నారంటే..

ఉడుపిలో పుట్టి పెరిగిన అర్చన మూడేళ్ల క్రితం వరకూ కర్ణాటకలోనే ఉండేవారు. భర్త సుదర్శన్ ఉద్యోగరీత్యా ఆస్ట్రేలియా వెళ్లారు. అర్చన శిక్షణపొందిన సాఫ్ట్‌వేర్ టెస్టింగ్ నిపుణురాలు. వంటలంటే మొదటి నుంచీ ఆసక్తి. ఓ పక్క ఉద్యోగ వేట కొనసాగిస్తూ కాలక్షేపంకోసం 2015లో హెబ్బార్స్ కిచెన్ పేరుతో ఫుడ్ బ్లాగ్ ప్రారంభించారు. మొదట్లో వంటలన్నీ ఫొటోలు తీసి పోస్ట్ చేసేవారు. బజ్‌ఫీడ్ టేస్టీ వీడియోస్‌కి లభిస్తున్న ఆదరణ చూశాక తానూ వీడియోలు పోస్ట్ చేస్తే బాగుంటుందన్న ఆలోచన వచ్చింది. 2016లో వీడియోలు పెట్టడం మొదలెట్టారు. కొద్దికాలంలోనే ఈ వీడియోలకు మంచి ఆదరణ లభించడం మొదలైంది.

### సంప్రదాయ వంటలే ఆకట్టుకునేలా...

ఇంతగా ఆదరణ పొందిన హెబ్బార్స్ కిచెన్‌లో ఎంతో అద్భుతమైన ఆధునిక వంటకాలు ఉంటాయనుకుంటే పొరపడినట్లే. పూర్తి సంప్రదాయ వంటకాలు మాత్రమే ఉంటాయి. పైగా సాంబార్, రసం తదితర పొడులన్నీ పద్ధతిగా ఇంట్లోనే ఎలా చేసుకోవాలో; దోసెపిండీ, ఇడ్లీ పిండీ ఎలా తయారుచేసుకోవాలో కూడా ఇందులో చూపిస్తారు. అర్చనకు కొత్త వంటలు ప్రయత్నించడమంటే ఇష్టం. ఇతర వంటల బ్లాగులతో పోలిస్తే తన బ్లాగు అంత గొప్పగా ఏమీ ఉండదనే ఆమె, అభిమానులు కోరినవి ఇవ్వడానికి ప్రయత్నిస్తానంటారు. ఎలాంటి వంటయినా సరే తయారీ విధానాన్ని ఆమె దశలవారీగా క్లుప్తంగా వివరిస్తారు.

అభిరుచిని హాబీగా మార్చుకుంటే ఇప్పుడదే అర్చనకి ఎంతో ఇష్టమైన పూర్తి స్థాయి వృత్తిగా మారిపోయింది. కొత్తలో ఐఫోన్‌తో, సెల్ఫీ స్టిక్ సాయంతో వీడియోలు తీసి పెట్టేవారట. ఆదరణ పెరగడంతో అర్చన భర్త ఆమెకు డీఎస్ఎల్ఆర్ కెమెరాతో పాటు వీడియో ఎడిటింగ్ సాఫ్ట్‌వేరూ కంప్యూటరూ బహూకరించారు. దాంతో వీడియోలు నాణ్యంగా వస్తున్నాయి. గూగుల్, ఫేస్‌బుక్, యూట్యూబ్‌ల భాగస్వామ్యంతో హెబ్బార్స్ కిచెన్ ఆమెకిప్పుడు మంచి సంపాదన తెచ్చిపెడుతోంది. తప్పనిసరిగా రోజూ ఓ కొత్త వంట పోస్ట్ చేసే అర్చన తద్వారా అభిమానుల సంఖ్యను స్థిరంగా కొనసాగించగలుగుతున్నానంటారు. ఆహారం తాజాగా రుచిగా ఉంటే అదే ఇంట్లోవారి ఆరోగ్యానికీ అనుబంధానికీ శ్రీరామరక్ష అవుతుందంటారు అర్చన. ★















**శివ, స్వర్ణకమలం, ఖైదీ, సిరివెన్నెల... 1980ల్లో వచ్చిన ఇలాంటి ఆణిముత్యాల్లాంటి సినిమాల్ని అంత త్వరగా మరచిపోలేం. రాధిక, సుహాసిని, కమల్‌హాసన్, సుమన్... ఆ రోజుల్లో వెండితెరని ఊపేసిన చాలామంది నటీనటుల్నీ సులువుగా మరచిపోలేం. మనలానే అప్పట్లో కలిసి నటించిన ఆ తరం హీరోహీరోయిన్లు కూడా ఇప్పటికీ ఒకరినొకరు మరచిపోలేకపోతున్నారు. అందుకే 'ఎయిటీస్ క్లబ్' పేరుతో వాళ్లంతా బృందంగా ఏర్పడి ప్రతి ఏడాదీ తప్పనిసరిగా కలుస్తూ ఆడీ పాడీ వేడుకలు చేసుకుంటున్నారు.**

# మళ్లీ మళ్లీ ఇది రాని రోజు

చిరంజీవి, వెంకటేష్, రాధిక, సుహాసిని, రజనీకాంత్, సుమన్, రాధ, రమ్యకృష్ణ, మమ్ముట్టి, మోహన్‌లాల్, భానుచందర్... ఇలా 1980 తరవాత తమ సినిమాలతో దక్షిణాది చిత్ర పరిశ్రమలో టాప్ హీరోహీరోయిన్లుగా పేరు తెచ్చుకున్నవాళ్లు చాలామంది ఉన్నారు. వీళ్లలో కొందరు ఇప్పటికీ హీరోలుగా కొనసాగుతున్నారు. ఇంకొందరు ఇతర పాత్రల్లో నటిస్తున్నారు. మరి కొందరైతే పూర్తిగా సినిమాలకు దూరమయ్యారు. కానీ అప్పట్లో కలిసి నటించిన చాలామంది నటీనటులు మాత్రం ఇప్పటికీ ఒకరికొకరు దూరం కాలేదు. వాళ్లంతా కలిసి ఎనిమిదేళ్ల క్రితం 'ఎయిటీస్ క్లబ్' పేరుతో ఓ బృందాన్ని ఏర్పాటు చేసుకున్నారు. ఏడాదికి ఓసారి కచ్చితంగా బృందంలోని సభ్యులంతా కలిసి సరదాగా గడపాలని నిర్ణయించుకున్నారు. ఆ రోజుల్లో సినిమా పరిశ్రమల మధ్య ప్రాంతీయ భేదాలు చాలా తక్కువ. రజనీకాంత్, కమల్‌హాసన్, మోహన్‌లాల్, ఖుష్బూ, శరత్‌కుమార్, అర్జున్, శోభన... నిజానికి వీళ్లంతా ఇతర సినీ పరిశ్రమలకు చెందిన వాళ్లయినా, తెలుగు సినిమాల్లోనూ ఎక్కువగానే నటించేవారు. మన వాళ్లు కూడా అడపాదడపా ఇతర భాషల సినిమాల్లోనూ కనిపించారు. దాంతో ఒకరితో ఒకరికి మంచి సంబంధాలు కొనసాగేవి. కానీ క్రమంగా వీళ్లందరి మధ్యా దూరం పెరగడం అప్పటి హీరోయిన్లు లిజీ, సుహాసినిలకు నచ్చలేదు. దాంతో ఇద్దరూ కలిసి తోటి నటీనటుల్ని ఒప్పించి 'ఎయిటీస్ క్లబ్' పేరుతో ఈ బృందాన్ని ఏర్పాటు చేసి ఏడాదికోసారి కచ్చితంగా కలవాలని నిర్ణయించుకున్నారు.

బృందంలో కేవలం తారలే ఉండాలనీ, వాళ్ల కుటుంబ సభ్యులు వేడుకలకు రాకూడదనీ రజనీకాంత్ షరతు పెట్టారు. ఇప్పటిదాకా వరసగా ఎనిమిదేళ్లపాటు వీళ్లంతా రకరకాల ప్రాంతాల్లో కలుసుకొని వేడుకలు చేసుకున్నారు. అప్పటి జ్ఞాపకాల్ని తలచుకొని మురిసిపోయారు. అందమైన బహుమతుల్ని ఇచ్చిపుచ్చుకున్నారు. చాలామంది తమ చేతి వంటనీ, ఇతర నైపుణ్యాల్నీ అందరికీ పరిచయం చేశారు. మొత్తంగా ఏటా దాదాపు 35 మంది ప్రముఖ నటీనటులు ఆరేడు రోజుల పాటు ఒకే కుటుంబంలా గడుపుతున్నారు. ఈ ఏడాది వీళ్లంతా తొలిసారి తమ వేడుకల్ని చైనాలో జరుపుకోవడం విశేషం.

## ఒక్కోసారి ఒక్కో చోట

మోహన్‌లాల్, సుహాసినీ, నైనా... ఇలా ఒక్కోసారి ఒక్కొక్కరు ఎయిటీస్ క్లబ్ వేడుకలకు ఆతిథ్యమిచ్చారు. ఏటా ఏదో ఒక థీమ్ పెట్టుకొని, దానికి తగ్గట్లుగా అందరూ ఒకే తరహా దుస్తులు వేసుకొని పార్టీలు చేసుకుంటున్నారు. ఓసారి చిరంజీవి ఎయిటీస్ క్లబ్ సభ్యుల చిన్నప్పటి ఫొటోలని సేకరించి, అంతా కలిసినప్పుడు ప్రదర్శన ఏర్పాటు చేశారు. మరోసారి పార్టీలో పాల్గొన్నప్పుడు దిగిన ఫొటోలని ఫ్రేమ్ చేయించి మోహన్‌లాల్ అందరికీ పంచారు. 'బయటి వేడుకల్లోలా లేనిపోని దర్పాన్నీ, తెచ్చిపెట్టుకున్న హుందాతనాన్నీ ఇక్కడ ప్రదర్శించాల్సిన అవసరం ఉండదు. మేము మాలానే ఉంటూ సరదాగా నిజాయతీగా ఇక్కడ గడపొచ్చు' అంటారు సుహాసిని. మొత్తానికి దక్షిణాది అగ్ర నటీనటులనంతా ఒకే ఫ్రేములో చూస్తున్న సినీ అభిమానులు మాత్రం తెగ సంబరపడుతున్నారు. 







శాండ్‌విచ్, చాక్లెట్, కప్‌కేకు... ఇలా ఏది తినాలన్నా దానిమీద ఉన్న ప్లాస్టిక్ రేపర్ తీయాల్సిందే. చెత్తబుట్టలో పారేయాల్సిందే. అదే రేపర్‌ని కూడా తినేయగలిగితే, ఐస్‌క్రీమ్ కోన్ మాదిరిగానే కాఫీ తాగాక ఆ కప్పునీ చప్పరించేస్తే... భూమినిండా ప్లాస్టిక్కు చెత్తా పేరుకోదు, పర్యావరణానికి హానీ కలగదు. సరిగ్గా ఆ కారణంతోనే కొన్ని కంపెనీలు ఒకే దెబ్బకు రెండు ప్రయోజనాలు చేకూరేలా తినగలిగే కవర్లనీ వస్తువుల్నీ రూపొందిస్తున్నాయి. వాటి కథాకమామీషు..!

# కాఫీ తాగేద్దాం... కప్పు తినేద్దాం..!




## కరకరలాడే కాఫీ కప్పు

చూడ్డానికి అచ్చంగా అట్టముక్కలాంటి ప్లాస్టిక్కుతో చేసినట్లే ఉంటాయి. కానీ బిస్కట్టుతో తయారైన స్కోఫీ కప్పులివి. కేఎఫ్‌సీ రూపొందించిన ఈ కప్పులపైన పంచదార కాగితాన్నీ లోపల వేడికి కరిగిపోని వైట్ చాకొలెట్ పూతనీ పూయడంతో కాఫీ వేడిగా ఉంటుంది. అది తాగాక కప్పుని బిస్కట్ల మాదిరిగా కొరికీ తినొచ్చు. ఇదేతరహాలో పండ్లరసాల్నీ చల్లనిపానీయాల్నీ అందించేందుకు అగర్‌అగర్ అనే సముద్ర నాచుతో గాజుని తలపించే జెల్లో గ్లాసుల్నీ తయారుచేస్తున్నారు. అందులోని పానీయాన్ని తాగేశాక ఎంచక్కగా ఆ గాజుని కొరుక్కుని తినేయొచ్చు.




## బ్రెడ్డు గిన్నెలు

హోటల్‌కి వెళ్లి సూపో సలాడో ఆర్డరు చేస్తాం. లేదా అన్నం పప్పూ అడుగుతాం. అప్పుడు బేరర్ బ్రెడ్డు గిన్నెల్లో సలాడ్‌నీ పప్పునీ అన్నాన్నీ కూరనీ అందంగా సర్ది లేదా సూపుని నింపి తీసుకొస్తాడు. తమాషా అనుకునేరు, అమెరికాలోని కొన్ని రెస్టరెంట్లలో ఈ బ్రెడ్డుగిన్నెల సర్వింగ్ ఓ ఫ్యాషన్‌గా మారింది. పూర్వకాలం నాటి మట్టికుండల్ని తలపించే ఈ బ్రెడ్డు గిన్నెల్ని మొదట్లో ఎవరో సరదాకోసమే తయారుచేసినా క్రమంగా ఈ బ్రెడబుల్ గిన్నెలు ఆహారప్రియుల్ని చవులూరిస్తున్నాయి. అందులో ఉన్న సూపు తాగేసి, ముడిధాన్యంతో చేసిన ఆ గిన్నెని ఏ కూరతోనో సలాడ్‌తోనో కలిపి ఎంచక్కా కొరికి తినేయొచ్చు.




## కొవ్వొత్తి కరిగిపోతోంది..!

పుట్టినరోజు, పెళ్లిరోజు... వేడుక ఏదైనా ఇటీవల కేకు మీద అలంకరించేవన్నీ దాదాపుగా తినేవాటితోనే తయారుచేస్తున్నారు. మరి, దానిమీద పెట్టే క్యాండిల్‌ను మాత్రం మైనంతో ఎందుకూ... దాన్నీ ఎంచక్కగా చప్పరించేస్తే ఎంత బాగుంటుందీ అనుకుంది శాండ్లర్ లోరీ అనే మహిళ. ఆలోచన రావడమే ఆలస్యం... 'లెట్ దెమ్ ఈట్ క్యాండిల్స్' పేరుతో ఈ చాక్లెట్ కొవ్వొత్తులను తయారుచేసింది. మైనం కన్నా త్వరగా కరిగిపోయే ఈ చాక్లెట్ కొవ్వొత్తులను, కేకుతోపాటు చప్పరించొచ్చు.



## బుడగలు ఎంతో రుచి

ఒక్క పిల్లలనేముందీ, చాలామంది పెద్దవాళ్లకు కూడా సోప్ బబుల్స్‌ను ఊదడమంటే భలే ఇష్టం. కానీ ఒక్కోసారి వాటిని ఊదుతుంటే ఆ సబ్బునీళ్లు పిల్లల నోట్లోకి వెళ్లిపోయి ఎక్కడ ఉక్కిరిబిక్కిరి అయిపోతారోనని భయం. ఇకనుంచీ ఆ భయం లేకుండా ఆ బుడగల్ని మధ్యమధ్యలో నోట్లో వేసుకుని మరీ చప్పరించవచ్చు. పైగా వీటిల్లో మనకి ఎప్పుడు ఏ ఫ్లేవర్ ఇష్టమైతే అది ఊదుకోవచ్చు. ఎందుకంటే ఒక ఎడిబుల్ బబుల్స్ కిట్‌లో లెమన్, ఆరెంజ్, సోడా... ఇలా ఆరు రకాల ఫ్లేవర్లు ఉంటాయి. సబ్బు బుడగలనే కాదు, లండన్‌లోని స్కిప్పింగ్ రాక్స్ ల్యాబ్ 'ఊహో బబుల్స్' పేరుతో ప్లాస్టిక్కుతో పనిలేని మంచినీళ్ల బుడగల్ని రూపొందించింది. సముద్రనాచుతో తయారుచేసిన ఈ బుడగలపై ఉండే సంచుల్ని నీటితో సహా మింగినా సరే, లేదా పారేసినా భూమిలో కలిసిపోతాయి. దాంతో ఈ తరహా ప్యాకింగుని శీతలపానీయాలకీ వాడాలనుకుంటున్నారు.

## 'కప్' కేకు... కెవ్వు కేక...

రకరకాల రుచుల్లో నోరూరించే కప్ కేకులే కాదు, వాటి రేపర్లూ చవులూరించేలా తయారుచేస్తున్నారు. డాక్టర్ ఓట్కర్ అనే కంపెనీ రూపొందిస్తోన్న ఈ 'ఎడిబుల్ వేఫర్ కప్ కేక్ కేసెస్' ఉంటే బేక్ చేయడానికి ప్రత్యేకంగా ప్లాస్టిక్ లేదా కాగితం కప్పుల అవసరం లేదు. ఈ కప్పుల్లో కేకు మిశ్రమాన్ని నింపేసి, నేరుగా బేక్ చేసేసి దాంతోపాటుగానే ఆ కేకుని ఆస్వాదించవచ్చు. పైగా ఈ కప్పులను పూర్తిగా శాకాహార పదార్థాలతోనే రూపొందించామనీ కాబట్టి వెజ్ కేకులు మాత్రమే తినేవాళ్లు సైతం నిరభ్యంతరంగా వాడుకోవచ్చనీ అంటున్నారు తయారీదారులు.





## ప్లాస్టిక్కు కాదు, ప్రొటీన్ రేపర్

షాపుకి వెళ్లి స్వీటు తిన్నా క్యాండీ కొన్నా అన్నింటికీ పలుచని పారదర్శక ప్లాస్టిక్ రేపర్లు ఉంటాయి. లోపలున్న పదార్థం పాడవకుండా ఉండేందుకే వాటిని చుట్టినప్పటికీ అది పర్యావరణానికి కలిగించే హాని అంతా ఇంతా కాదు, పైగా అందులోని రసాయనాలు సైతం ఆ పదార్థంలోకి వెళ్లి, ఆరోగ్యానికీ ఎంతో కొంత హాని కలిగిస్తాయి. అందుకే అమెరికన్ వ్యవసాయ విభాగం పాలల్లోని కేసిన్ అనే ప్రొటీన్‌తో ప్లాస్టిక్‌ను పోలిన పలుచని కాగితాన్ని రూపొందించింది. ఇది లోపలున్న పదార్థం పాడవకుండా చేయడంలో ప్లాస్టిక్ కన్నా ఐదు వందల రెట్లు ప్రభావవంతంగా పనిచేస్తుందట. అదేసమయంలో ఆ స్వీటుతో సహా దీన్ని కూడా తినేయొచ్చు. ఈ ప్రొటీన్ ప్లాస్టిక్కే కాదు, మరికొన్ని ఫాస్ట్‌ఫుడ్ ఛెయిన్లు సైతం బర్గర్లూ శాండ్‌విచ్‌లను తినే రైస్ పేపర్లను చుట్టి అందిస్తూ తాము సైతం పర్యావరణ ప్రియులమేనని చాటుకుంటున్నాయి.

## తినే పెన్నూ పెన్సిలూ..!

ఏదో ఆలోచిస్తూ రాస్తుంటే ఆటోమేటిగ్గా చేతిలోని పెన్ను నోట్లోకి వెళ్లిపోతుంటుంది. అలా వెళ్లినప్పుడల్లా పెప్పర్‌మింట్లలా ఒకదానిమీద ఒకటి చొప్పున అతికించిన క్యాండీని చప్పరించేయొచ్చు. ఇలా దాదాపు 22 క్యాండీలతో చేసిన ఈ పెన్నుల్ని వాటిలోపల నింపిన ఇంకుతోసహా తినేయొచ్చు. చివరగా మిగిలి ఉండే మెటల్ టిప్పుని మాత్రం ఊసేయాల్సిందే. పైగా ఈ క్యాండీలను మన చేతులకి అతుక్కోకుండా కరిగిపోకుండా ఉండేలా తయారుచేస్తున్నారు. అలాంటివే క్రేయాన్లూ వస్తున్నాయి. పిల్లలు బొమ్మలేసుకుంటూ ఒక్కోసారి ఆ రంగు పెన్సిళ్లను నోట్లో పెట్టుకుంటుంటారు. అందుకే పండ్లరసాలూ తినేరంగులూ పంచదారతో తయారుచేసిన ఈ రంగుపెన్సిళ్లని తిన్నా ఆరోగ్యానికి ఎలాంటి హానీ కలగదు.



## తింటూ ఆడదామా...

పెద్దవాళ్లు పిండి కలుపుతుంటే మాకూ కావాలని గొడవ చేస్తుంటారు పిల్లలు. దాంతో వాళ్లకి ఆడుకోవడానికి పాలిమర్ క్లేని ఇస్తుంటారు. అయితే ఆకర్షణీయమైన రంగుల్లో కనిపిస్తోన్న ఆ ప్లాస్టిక్ మట్టిని గభాల్న నోట్లో పెట్టుకుంటే ప్రాణాలకే ప్రమాదం. అందుకే మార్ష్‌మాలోలతో చేసే ఈ 'ఎడిబుల్ ప్లే డవ్'ల వాడకం బాగా పెరిగింది. పంచదార, జెలాటిన్, నీటితో తయారయ్యే మార్ష్‌మాలోలు స్పాంజిల్లా ఉంటాయి. వీటిల్లో నూనె, తినే రంగులు, కార్న్‌స్టార్చ్‌లు కలిపి ఈ రంగురంగుల పిండిముద్దల్ని రూపొందిస్తున్నారు. వీటితో పిల్లలు పండ్లూ కేకులూ బిస్కెట్లూ బొమ్మలూ చేస్తూ ఆడుకోవడమే కాదు, తిన్నా పర్లేదు.

చూశారుగా, ఎన్ని రకాల తినే వస్తువులో... ఈ ట్రెండ్ ఇలాగే కొనసాగాలనీ, ప్లాస్టిక్కుకి చరమగీతం పలికేరోజు త్వరలోనే రావాలనీ ఆశిద్దాం.

## గోళ్లరంగు భలే రుచి

పిల్లలకు లిప్‌స్టిక్కులూ గోళ్లరంగులూ అంటే మహా ఇష్టం. కానీ వాళ్లు తరచూ పెదాలను తడుపుకోవడం, వేళ్లను నోట్లో పెట్టుకోవడం చేయడంతో ఆ రంగులూ తద్వారా అందులోని రసాయనాలూ నోట్లోకి వెళ్లిపోతాయి. కొన్ని సందర్భాల్లో పెద్దవాళ్లూ మరిచిపోయి అలా చేస్తుంటారు. ఆ సమస్య లేకుండా ఉండేందుకే ఇటీవల కొన్ని కంపెనీలు కోకో లిప్స్, కిడ్ లిక్స్... వంటి ఎడిబుల్ లిప్‌స్టిక్కుల్నీ గోళ్లరంగుల్నీ తయారుచేస్తున్నాయి. కొందరు షెఫ్‌లు సైతం మౌల్డ్స్ ద్వారా రకరకాల పండ్లరసాలతోనూ లిప్‌స్టిక్కుల్ని చేసేస్తున్నారు. సో, ఇవిగానీ వేసుకుంటే ఆయా ఫ్లేవర్‌ని బట్టి మధ్యమధ్యలో పెదాలను తడుపుకుంటూ చాక్లెట్‌నో పండునో చప్పరించిన అనుభూతినీ పొందవచ్చు.





**అందం, అభినయం కలగలిసిన నటీమణులు ఇటీవలి కాలంలో తక్కువగానే కనిపిస్తున్నారు. ఆ రెండు ప్రత్యేకతలూ ఉన్న నటి నివేతా థామస్. మూడు దక్షిణాది భాషల్లో నటిస్తున్నప్పటికీ, తెలుగులోనే ఎక్కువగా అభిమానుల్నీ, గుర్తింపునీ సంపాదించింది. 'జెంటిల్‌మన్'లో కేథరిన్, 'నిన్నుకోరి'లో పల్లవి పాత్రల్లో కనిపించిన నివేతా... నిజ జీవితంలోని తన పాత్ర గురించి చెబుతోందిలా..!**

# బి.ఆర్క్. ఫైనలియర్‌లో ఉన్నా!

అమ్మానాన్నల మద్దతు, ప్రోత్సాహం లేకుంటే ఇక్కడివరకూ వచ్చేదాన్ని కాదు. నాకు ఎనిమిదేళ్లపుడు సినిమాలో నటించే అవకాశం వస్తే ఓ ప్రయత్నం చేసి చూద్దామని ఆరోజు వాళ్లు అనుకోబట్టే ఈరోజు మీ ముందుకు రాగలిగాను. మాది కేరళలోని కన్నూర్. నేను పుట్టి, పెరిగిందంతా చెన్నైలోనే. అక్కడి 'మాంట్ ఫోర్ట్' స్కూల్లో చదువుకున్నాను. స్కూల్లో పాటలూ, డాన్సులూ లాంటి అంశాల్లో ఎప్పుడూ ముందుండే దాన్ని. ఓసారి మా స్కూల్లో బాలల ఉత్సవం జరిగింది. అక్కడికి వచ్చిన మలయాళ నటి పూర్ణిమా ఇంద్రజిత్ నన్ను చూశారు. అప్పటికి ఆమెకు తెలిసినవాళ్లు ఓ సినిమా కోసం నా వయసు పాపకోసం వెతుకుతున్నారట. నా వివరాలు కనుక్కొని దర్శకుడికి చెప్పారు. నాకు అప్పటికి సినిమాలపైన అంత అవగాహన కూడా లేదు. ఇంటికి వచ్చి అమ్మానాన్నలతో మాట్లాడారు. షూటింగ్ కోసం చెన్నై నుంచి కేరళ వెళ్తున్నపుడు అమ్మానాన్న నాకు ఆ సినిమా కథ గురించి చెప్పారు. తర్వాత డైరెక్టర్ కూడా కథ బాగా వివరించారు. ఆ సినిమాలో కథ నా పాత్ర చుట్టూ తిరుగుతుంది. 2002లో విడుదలైన ఆ సినిమా పేరు 'ఉత్తర', బాగా ఆడింది. దానికి బాలనటిగా నాకు కేరళ ప్రభుత్వం అందించే అవార్డు వచ్చింది. ఆ తర్వాత సినిమాలకు ఆరేళ్లు గ్యాప్ వచ్చింది. మళ్లీ 2008లో ఓ మలయాళ, మరో తమిళ చిత్రాల్లో నటించే అవకాశం వచ్చింది. అప్పట్నుంచీ సినిమాలూ, చదువూ రెండూ కొనసాగుతున్నాయి. ఏటా సెలవుల్లో సినిమాల్లో నటించే దాన్ని. అవి హిట్టయినా, కాకపోయినా స్కూల్ తెరిచాక అవన్నీ మర్చిపోయి చదువులో నిమగ్నమైపోతుండేదాన్ని. 2011 నుంచి బాలనటిని కాస్తా నటిని అయ్యాను. తమిళం, మలయాళ భాషల్లో ఆరేడు సినిమాల్లో ప్రాధాన్యమున్న పాత్రలు చేశాను.

## 'దృశ్యం' చేయలేకపోయాను

దర్శకుడు జీతూ జోసెఫ్ మలయాళ 'దృశ్యం'లో మోహన్‌లాల్‌కి కూతురిగా చేయమన్నారు. కానీ నాకప్పుడు పరీక్షలు ఉండటంతో చేయలేకపోయాను. ఆ తర్వాత మధ్యలో కొన్ని సినిమాలూ చేశాను. రెండేళ్ల తర్వాత జీతూ ఫోన్‌చేసి 'పాపనాశం(దృశ్యం తమిళ రీమేక్)'లో చేయమన్నారు. హిట్ సినిమా, ఆపైన కమల్‌హాసన్ గారు ఉండటంతో ఈసారి రెండో ఆలోచన లేకుండా చేశాను. జీవితంలో అలాంటి అవకాశాలు మళ్లీమళ్లీ రావు. కమల్ సర్‌ని తెరపైన చూస్తూనే చాలా నేర్చుకోవచ్చు. అలాంటిది ఆయనతో కలిసి పనిచేసే అవకాశం వచ్చింది. సెట్స్‌లో ఆయన్నుంచి చాలా నేర్చుకున్నాను. ఇన్ని దశాబ్దాల తర్వాత కూడా ప్రతీ సినిమానీ ఉత్సాహంతో చేయడమే కాకుండా తోటి నటుల్లోనూ ఉత్సాహం నింపుతారాయన. ఆయనకి కూతురుగా నటించినా షూటింగ్ పూర్తయిన నాటికి నిజంగానే నాన్న అన్న ఫీలింగ్ వచ్చింది. మా నాన్న దుబాయిలో ఆ సినిమా చూసి బాగుందని ఫోన్‌చేసి చెప్పారు.

## యూట్యూబ్‌లో చూశారు

'పాపనాశం' విడుదల సమయంలో ఓ తమిళ టీవీకి ఇంటర్వ్యూ ఇచ్చాను. డైరెక్టర్ ఇంద్రగంటి మోహన్‌కృష్ణ గారు 'జెంటిల్‌మన్' సినిమాలో కేథరిన్ పాత్రకోసం హీరోయిన్‌ను వెతుకుతున్న రోజులవి. ఆఫీసులో ఎవరో యూట్యూబ్‌లో నా తమిళ ఇంటర్వ్యూ చూస్తున్నపుడు... మోహన్‌గారు ఒక రూమ్ నుంచి వేరొక రూమ్‌కి వెళ్తూ కంప్యూటర్ స్క్రీన్‌మీద నన్ను చూశారు. సహ దర్శకుడు సురేష్‌కీ చూపారు. సీన్‌కట్ చేస్తే చెన్నైలో మా ఇంటికి వచ్చి నాకు జెంటిల్‌మన్ కథ చెప్పారు మోహన్ సర్. అప్పటివరకూ దాదాపు నా సెలవుల్నిబట్టి సినిమాలు చేస్తూ వచ్చేదాన్ని. కానీ ఈ సినిమా కోసం అవసరమైతే సెలవు పెడతానని అమ్మకు చెప్పేశా. కథ అంతలా నచ్చింది. మోహన్ సర్ కూడా వెళ్తూ వెళ్తూ 'ఏదేమైనా సరే సినిమాలో నివేత ఉండాల'న్నారు. ఆ మాట నాకు మరింత ఉత్సాహాన్నిచ్చింది. కథ విన్నరోజునుంచే సినిమాపైన బాగా మనసు పెట్టాను. జెంటిల్‌మన్ షూటింగ్ అనుభవం నాకు నటన పరంగా స్కూల్ అని చెబుతాను. ప్రతి సినిమా నుంచీ ఎంతోకొంత నేర్చుకుంటాం. కానీ జెంటిల్‌మన్ నుంచి చాలా నేర్చుకున్నాను. చుట్టూ ఉన్న మనుషులూ, పనిచేసే విధానం, పని వాతా

వరణం... అన్నీ చాలా బావుండేవి. 'తెలుగులో కొత్త' అని మొదట కాస్త భయ పడ్డాను. కానీ చాలా బాగా జరిగిందా షూటింగ్. మోహన్ సర్, నానీ, నేను ఖాళీ దొరికితే స్క్రిప్టు గురించే మాట్లాడేవాళ్లం. నటుల నుంచి ఏం కావాలో మోహన్ సర్‌కి బాగా తెలుసు. కమ్యునికేషన్స్‌లో ఆయనకి పీహెచ్‌డీ ఇవ్వొచ్చు.

### నిన్ను కోరి... ఏరికోరి!

చాలామందికి మొదటి సినిమాకి అన్నీ కలిసొస్తాయి. కానీ రెండో సినిమా అసలైన పరీక్ష. 'జెంటిల్‌మన్'లో కేథరిన్ పాత్రకు ఊహించని గుర్తింపు వచ్చింది. అలాగని నేను కొత్త కథలు విన్నపుడు ఆ ఇమేజ్‌పెట్టి ఆలో చించలేదు. అంతకంటే కూడా స్క్రిప్టు ముఖ్య మని నమ్ముతాను. కాలేజీ మూడో సంవ త్సరం పూర్తయిన తర్వాత సెలవుల్లో 'జెంటి ల్‌మన్' చేశాను. సినిమా రిలీజయ్యాక కాలేజీ మొదలైంది. దాంతో చదువులో బిజీ అయిపో యాను. మధ్యలో సక్సెస్ పార్టీ, సక్సెస్ మీట్ లతో అదే బృందంతో జర్నీ కొనసాగింది. కాబట్టి ఖాళీగా ఉన్నానన్న ఆలోచనే రాలేదు. జెంటిల్‌మన్ హ్యాంగ్ ఓవర్ నుంచి బయటకు రావడానికి ఆరు నెలలు పట్టింది. తర్వాత చాలా స్క్రిప్టులు విన్నాను. ఏదీ అంత బాగా నచ్చలేదు. ఒక తరహా పాత్ర బాగా చేస్తే మళ్లీ మళ్లీ అలాంటివే వస్తాయి. కానీ మళ్లీ కేథరిన్‌లాంటి పాత్ర చేయడం నచ్చేది కాదు. కథ విన్నపుడే ఉత్సాహాన్నివ్వాలి అనుకునే దాన్ని. అందుకే దాదాపు ఏడాదిపాటు వేచి చూశాను. ఆ సమయంలో నానీ ఫోన్‌చేసి 'ఓ కథ ఉంది విను' అని చెప్పారు. ఇమేజ్ అంటూ పెట్టుకోకుండా కొత్తదనం కోసం చూసే నటుడు నానీ. తను చెప్పాడంటే విషయం ఉంటుందనుకున్నాను. అదే 'నిన్ను కోరి'. కోన వెంకట్‌గారు నాకు ఆ కథ చెప్పారు. కథ పూర్తిగా విన్నాక రీకేప్ చేసుకో వడానికి 10-15 సెకన్లు సమయం తీసుకు న్నాను. తర్వాత 'షూట్ ఎప్పుడు మొదలు పెడదాం' అని అడిగాను. మేం ఊహించిన దానికంటే కూడా ప్రేక్షకులు ఈ సినిమాని పెద్ద హిట్ చేశారు. దర్శకుడు శివకి ఇదే తొలి చిత్రం. మోహన్ గారి సినిమాలో చేసిన తర్వాత వేరెవరితో పనిచేసినా బెటర్‌మెంట్ కోసం ఆలోచిస్తుంటాం. కానీ శివ కూడా స్క్రిప్టుపైన పూర్తి అవగాహనతో ఉండేవాడు. కథని ఎప్పుడూ డిస్కస్ చేయడానికి సిద్ధంగా ఉండేవాడు. మళ్లీమళ్లీ కొత్తగా రాయడానికి ప్రయత్నించేవాడు. సినిమా హిట్ అవ్వాలని శివ గురించే ఎక్కువగా కోరుకున్నాను. కథలో ప్రధాన పాత్రలైన ఉమ, పల్లవి, అరుణ్‌లాంటివారు మనచుట్టూ చాలామంది ఉన్నారు. వారంతా తమని తాము తెరపైన చూసుకున్నారు. షూటింగ్ సమయంలో 40 రోజులు శాన్‌ఫ్రాన్సిస్కోలో ఉన్నాం. ప్రసాద్‌గారని ఓ ఎన్.ఆర్.ఐ... వాళ్లింట్లోనే షూటింగ్. అక్కడ యూనిట్ అంతా ఒక కుటుంబంలా ఉండేవాళ్లం. ఇంట్లో అందరికీ వడ్డిస్తూ, ఇంటిని శుభ్రంగా ఉంచుతూ ఆ ఇంట్లో అమ్మాయిలానే ఉన్నాను. సహాయ సిబ్బంది ఎక్కువగా లేకపోవడంతో యూనిట్ సభ్యులందరం షూటింగ్ సమయంలో చాలా కష్టపడ్డాం. అమెరికా నుంచి తిరిగి వచ్చేట పుడు అందరూ ఒక విధమైన భావోద్వేగానికి గురయ్యారు. సినిమా రిలీజ్ రోజున ఉదయం 8:45 గంటల షోకి ప్రసాద్స్‌కి వెళ్లాను. ప్రేక్షకుల స్పందన చూశాక కష్టమంతా మర్చిపోయాను.

### సెల్ఫీ అడుగుతారు

స్కూల్ రోజుల్లో ఏరోనాటికల్ ఇంజినీర్ అవ్వాలనుకున్నాను. ఆకాశంలో విహరించడ మనే ఆలోచన గొప్పగా అనిపించేది. కానీ కుదరలేదు. సినిమాల కారణంగా నా చదువు నిర్లక్ష్యం కాకూడదని మొదట్నుంచీ అమ్మా నాన్నా, నేనూ అనుకునేవాళ్లం. సినిమా, చదువు... రెండిట్లో ఏది ఫస్ట్ అంటే చెప్పలేను. రెండూ ముఖ్యమే. జెంటిల్‌మన్‌కి ముందు కూడా కొన్ని సినిమాల్లో అవకాశాలు వచ్చాయి. కానీ చదువుకి ఆటంకమని వాటిని చేయలేదు. ప్రస్తుతం చెన్నైలోని ఎస్.ఆర్.ఎమ్. యూనివర్సిటీలో 'బ్యాచిలర్ ఆఫ్ ఆర్కిటెక్చర్' చదువుతున్నాను. అయిదేళ్ల కోర్సది. ఫైనలియర్‌లో ఉన్నాను. పదేళ్లుగా చదువూ, సినిమాలూ రెండూ సమాంతరంగా సాగుతున్నాయి. సినిమాలు చేస్తున్నపుడు కాలేజీ గుర్తొచ్చి ఎప్పుడు వెళ్తానా అనిపి స్తుంది. ఎక్కువ రోజులు కాలేజీలో ఉంటే కొత్త సినిమా ఎప్పుడు మొదలవుతుందో అనిపిస్తుంది. నా కెరీర్‌ని 'జెంటిల్‌మన్'కు ముందూ తర్వాతా అని విభజించాలి. ఎందు కంటే అదివరకు నేను సినిమాలు చేసినా, జీవితంలో పెద్ద తేడా రాలేదు. ఎస్.ఆర్. ఎమ్.లో తెలుగు విద్యార్థులు ఎక్కువ. కారు దిగి క్లాస్‌రూమ్‌కి వెళ్లేలోపల 20-30 మంది సెల్ఫీ కోసం అడుగుతారు. ఎవరికీ నో చెప్పను. అలాంటపుడు ఒక్కోసారి క్లాసుకి లేటవుతుంది. అందుకే ఈ మధ్య అందరి కంటే ముందే కాలేజీకి వెళ్లి క్లాసులో కూర్చుం టున్నా. అయినా కూడా 'మేం మీ ఫ్యాన్స్' అనీ, 'నానీ ఫ్యాన్స్' అనీ చాలామంది మా డిపార్ట్‌మెంట్ దగ్గరకీ వచ్చి మాట్లాడతారు. సినిమాల గురించి చెబుతారు. సినిమాల గురించి ఫీడ్‌బ్యాక్ అందరికంటే నాకు బాగా తెలుస్తుంది. ఆర్కిటెక్చర్ కాస్త క్లిష్టమైన సబ్జెక్ట్. అందుకే కాలేజీకి వెళ్లాక అప్పటిదాకా మిస్సయిన క్లాసుల్ని స్నేహితులూ, లెక్చరర్ల చేత చెప్పించుకుంటాను. షూటింగ్‌లో ఉన్న పుడు ఖాళీ దొరికితే క్లాసు పుస్తకాలు తిరగే స్తాను. ఆర్కిటెక్చర్, సినిమా రెండూ సృజనా త్మక విభాగాలు. వీటికి వంద శాతం ఏకా గ్రత, అంకితభావం అవసరం. భవిష్యత్తులో సినిమాల్లో ఉంటానో, ఆర్కిటెక్ట్‌గా పనిచేస్తానో, లేక టీచింగ్ వైపు వెళ్తానో... ఏమో, ఇప్పుడే తేల్చి చెప్పలేను.

– సుంకరి చంద్రశేఖర్



### బుల్లెట్‌పై షికారు చేస్తా...

అమ్మ ఇల్లీ... నాతోనే చెన్నైలో ఉంటుంది. నాన్న షాజూ థామస్. దుబాయిలో ఉంటారు. నాకో తమ్ముడు... నిఖిల్.

★ బుల్లెట్... నా ఫేవరెట్ బైక్. దాని శబ్దం ఆకట్టుకుంటుంది. నాన్న బుల్లెట్ నడుపుతూ నేర్చుకున్నాను. నాకు కొత్త బుల్లెట్ కొనివ్వాలని అమ్మ అనుకుంది. కానీ సినిమాల్తో, చదువులో బిజీగా ఉండి, బైక్‌ని ఇంట్లో ఖాళీగా ఉంచేయడం ఎందుకని ప్రస్తుతానికి వద్దనిచెప్పా.

★ ఫ్రెండ్స్‌తో షికార్లకి ఎక్కువగా వెళ్లను. ఎప్పుడైనా ఒకచోట కలుసుకుని లంచ్, డిన్నర్ చేస్తూ మాట్లాడుకుంటాం.

★ నచ్చిందల్లా తింటాను. వాసన చూస్తేనే బరువు పెరిగిపోయే రకం నా శరీరానిది. అందుకే బాగా వ్యాయామం చేస్తాను. డాన్స్ కూడా ప్రాక్టీసు చేస్తాను.

★ ఎవరికైనా అత్యవసరంగా బ్లడ్ కావాలంటే వెళ్లి ఇస్తాను. అనాథాశ్రమాలకూ, వృద్ధాశ్రమాలకూ వెళ్తుంటాను.

★ సోషల్ నెట్‌వర్క్‌ని సినిమా ప్రచారానికి ఉపయోగిస్తాను. ట్విటర్, ఫేస్‌బుక్, ఇన్‌స్టాగ్రామ్‌లలో ఉన్నాను.

★ ఇప్పటివరకూ ఒకేసారి రెండు సినిమాలు చెయ్యలేదు. ఇప్పుడు ఎన్టీఆర్‌తో 'జై లవ కుశ' చేస్తున్నాను.




# ఈ ఆప్ చిన్నారుల కోసం!

**చిన్నారుల పెదాలపైన చిరునవ్వులు...**
**కన్నవారి కళ్లల్లో మెరుపులు.**
**వారు పలికే తొలి మాటలు...**
**అమ్మానాన్నలు ఎప్పటికీ గుర్తుంచుకునే మధుర జ్ఞాపకాలు.**
**కానీ పిల్లలు నవ్వాల్సిన వయసులో నవ్వకుంటే,**
**'అమ్మ...' అని పలకడం ఆలస్యమవుతుంటే...**
**సందేహాలు మొదలవుతాయి. ఆ సందేహాల్ని నివృత్తి**
**చేసుకోవడంలో సాయపడుతుంది 'మై చైల్డ్' ఆప్.**



పిల్లలకి మూడో నెల వచ్చేసరికే నవ్వుతుండాలి, 7-10 నెలల వయసులో పాకడం మొదలుపెట్టాలి, తొమ్మిదో నెలకి వారి నోట అమ్మ, తాత లాంటి పదాలు రావాలి... ఓ నెల అటూఇటుగా అలాంటి మార్పులు కనిపించకపోతే మాత్రం వారిని పరీక్షించాల్సిందే. మీ ఫోన్లో 'మై చైల్డ్' ఆప్ ఉంటే ఆ పరీక్ష ఇపుడెంతో సులభం.

### ఇలా గుర్తించవచ్చు

ఎదిగే పిల్లల్లో నరాలూ, మెదడు పనితీరుకు సంబంధించిన సమస్యల్ని నెలల వయసులోనే గుర్తించే విధంగా మై చైల్డ్ ఆప్‌ని అభివృద్ధి చేశారు హర్ష్ సోంగా, అతడి బృందం. నెల నుంచి 24 నెలల వయసుండే పిల్లల ఎదుగుదలలో సమస్యల్ని గుర్తించేందుకు ఈ ఆండ్రాయిడ్ ఆప్ సాయపడుతుంది. దీన్లో మొదట పిల్లల వయసు, ఎత్తు, బరువు లాంటి వివరాల్ని నమోదుచేయాలి. ఆ తర్వాత సాధారణంగా పిల్లల్లో ఆయా నెలల్లో వచ్చే మార్పుల గురించి కొన్ని ప్రశ్నలు వేస్తారు. వాటికి 'ఔను/కాదు' అన్న సమాధానం ఇవ్వాలి. ఆప్‌లోని కృత్రిమ మేధ సాయంతో వాటన్నిటినీ పరిశీలించిన మీదట ఏవైనా సమస్యలు ఉన్నదీ లేనిదీ మనకి తెలుస్తుంది. పిల్లల వయసు మూడు నెలలు అయితే... నవ్వుతున్నారా, మెడ నిలుపుతున్నారా, బోర్లా పడుతున్నారా... లాంటి ప్రశ్నలు అడుగుతారు. వీటికి తల్లిదండ్రులు ఇచ్చే సమాధానాన్నిబట్టి ఫలితం సెకెన్ల వ్యవధిలోనే తెలుస్తుంది. తర్వాత ప్రతి నెలా పిల్లల బరువు, ఎత్తులలో మార్పుల్ని నమోదుచేస్తూ ఆయా నెలలకు సంబంధించిన ప్రశ్నలకు జవాబు ఇస్తుంటే వారి హెల్త్ రిపోర్ట్ వస్తుంది. పిల్లల ఎదుగుదలలో ఏదైనా అనుమానం ఉంటే ఈ ఆప్‌ద్వారా దాన్ని నివృత్తి చేసుకోవచ్చు. అనుమానం లేకపోయినా పిల్లల ఎదుగుదల సాధారణంగా ఉన్నదీ లేనిదీ తెలుసుకోవడానికీ ఈ ఆప్‌ను ఉపయోగిస్తున్నవారూ ఉన్నారు. పిల్లలకు సంబంధించిన ఆరోగ్య సమాచారాన్నీ, రికార్డుల్నీ ఈ ఆప్‌లో భద్రం చేసుకోవచ్చు. దీని ద్వారా తల్లిదండ్రులకు పిల్లల ఆరోగ్య సంరక్షణ, పెంపకానికి సంబంధించిన సమాచారాన్నీ అందిస్తారు. ఇంకా పిల్లలకు సంబంధించి - అన్ని రకాల వైద్య నిపుణుల సమాచారాన్నీ దీన్లో పొందవచ్చు. కావాలనుకుంటే అందులోంచే డాక్టర్ అపాయింట్‌మెంట్‌నీ తీసుకోవచ్చు.







### ఒకనాటి బాధితుడు...

సొంత అనుభవం నుంచి ఈ ఆప్‌ని అభివృద్ధి చేయాలనే ఆలోచన వచ్చిందంటాడు హర్ష్. అతడికి చిన్నపుడు డిస్‌ప్రేక్సియా(మెదడు, శరీర భాగాల మధ్య సమన్వయ లోపం) సమస్య ఉండేది. పిల్లలు రెండేళ్ల వయసులో ఉన్నపుడే దీన్ని గుర్తించవచ్చు. కానీ అతడికి 11ఏళ్లు వచ్చాక గానీ తల్లిదండ్రులు ఆ సమస్యని గుర్తించలేదు. ఆ తర్వాత చికిత్స తీసుకుని మామూలు మనిషి అయ్యాడు. 'ప్రతి ఆరుగురిలో ఒకరు నాలాంటి సమస్యతో బాధపడుతున్నట్టు చదివాను. వారిలో చాలామందికి పదేళ్లు వచ్చేవరకూ ఆ సమస్యని గుర్తించి చికిత్స తీసుకున్నది లేదు. ఈ సమస్యకి పరిష్కారం చూపించాలనుకున్నాను. ఓ పక్క చదువుకుంటూనే రెండేళ్లపాటు దీని మీద పరిశోధన చేశాను' అని చెబుతాడు హర్ష్. 16 ఏళ్ల వయసులో కంప్యూటర్ కోడింగ్ నేర్చుకున్న అతడు, ఆ నైపుణ్యంతో పిల్లల్లో సమస్యల్ని ఆప్ ద్వారా గుర్తించగలిగేలా సాంకేతికతను అభివృద్ధి చేశాడు. 2015 జనవరిలో ఈ ఆప్‌ని అందుబాటులోకి తెచ్చిన హర్ష్ తర్వాత కూడా అప్‌డేట్ చేస్తూ వస్తున్నాడు. దీని అభివృద్ధిలో వైద్యుల సాయాన్నీ తీసుకున్నాడు. ఈ ప్రయాణంలో అతడికి మొదట ఆఫ్రీన్ అన్సారీ తర్వాత వీరిద్దరి స్నేహితురాలు శ్రేయా శ్రీవాస్తవ తోడయ్యారు. హర్ష్, ఆఫ్రీన్ ఇద్దరూ 19 ఏళ్ల వయసులో బీసీఏని మధ్యలోనే వదిలి పెట్టేసి ఆప్ అభివృద్ధిపైన దృష్టి పెట్టారు. దీనికోసం తమ కార్యాలయాన్ని భోపాల్ నుంచి బెంగళూరుకి మార్చుకున్నారు.


హర్ష్, ఆఫ్రీన్, శ్రేయ

మై చైల్డ్ ఆప్ ఆలోచన నచ్చి చాలామంది యువ పెట్టుబడిదారులు వీరి కంపెనీలో పెట్టుబడులకు ముందుకు వచ్చారు. 'ఈ ఆప్ ద్వారా కొద్ది శాతం పిల్లల్లో మార్పు తీసుకురాగలిగినా దాని ప్రభావం ప్రత్యక్షంగా ఆయా కుటుంబాల్లో, పరోక్షంగా ప్రపంచంపైనా చాలా ఉంటుంది' అని చెబుతారు పెట్టుబడిదారుల్లో ఒకరైన పల్లవ్. అంకుర సంస్థల్ని ప్రోత్సహించడానికి ఫేస్‌బుక్ ప్రారంభించిన 'ఎఫ్‌బీస్టార్ట్' కార్యక్రమానికి హర్ష్ ఆలోచన ఎంపికవడంతో ప్రారంభంలో ఆ సంస్థ నుంచి మార్గనిర్దేశం, సాంకేతిక సహకారం లభించాయి కూడా. ఫేస్‌బుక్ సీవోవో షెరిల్ శాండ్‌బర్గ్ తన బ్లాగ్‌లో మై చైల్డ్ ఆప్ గురించి ప్రస్తావించడంతో ఈ ఆప్‌కు ప్రపంచవ్యాప్తంగా గుర్తింపు వచ్చింది.

ఈ ఆప్‌ని ఇప్పటివరకూ 135 దేశాలకు చెందిన 10వేల మంది డౌన్‌లోడ్ చేసుకున్నారు. డౌన్‌లోడ్ల సంఖ్య ప్రతి నెలా 20 శాతం పెరుగుతోంది. 2025నాటికి 5 కోట్ల మంది తల్లిదండ్రుల్ని చేరాలన్నది వీరి లక్ష్యం. అందులో మీరూ ఉంటారేమో!



మామూలుగా లెక్కలంటే చాలా మందికి బోర్. కానీ ఆ పదీ ఎక్కువ అమ్ముడు పోయినవట. ఈ పదీ ఖరీదైనవట. అక్కడ బంగారం నిల్వలు వేల టన్నుల్లో ఉన్నాయట... ఇలా కొన్నిటి గురించి చెప్పే లెక్కల్ని చూస్తే కళ్లు పెద్దవి చేసుకుని మరీ చదివేస్తుంటారు. అలా ఆశ్చర్యంగానూ ఆసక్తికరంగానూ అనిపించే టాప్ టెన్ కబుర్లే ఇవి.

# 'దశ' దిశలా...

## మనవాళ్లే సుందరీమణులు

ఇప్పటివరకూ ప్రపంచ సుందరి కిరీటాన్ని భారత్ అయిదుసార్లు గెలుచుకుంది. వెనిజులా తర్వాత ఆ ఘనత సాధించిన దేశం మనదే. మిస్ యూనివర్స్‌ని కూడా మనదేశం రెండుసార్లు కైవసం చేసుకుంది. ఈ రెండిటినీ కలిపితే మొదటి పది స్థానాల్లో ఉన్న దేశాలివి.



| దేశాలు | కిరీటం గెలుచుకున్న వారి సంఖ్య |
|---|---|
| 1. వెనిజులా | 13 |
| 2. అమెరికా | 11 |
| 3. భారత్ | 7 |
| 4. స్వీడన్ | 6 |
| 5. ప్యుయెర్టొరికో | 5 |
| 6. బ్రిటన్ | 5 |
| 7. ఫిలిప్పీన్స్ | 4 |
| 8. ఆస్ట్రేలియా | 4 |
| 9. బ్రెజిల్ | 3 |
| 10. నెదర్లాండ్స్ | 3 |

## ఎక్కువ ప్రయాణాలు ఫ్రాన్స్‌కే!

విదేశీ పర్యటకుల్ని ఎక్కువగా ఆకర్షించే దేశాల్లో ఫ్రాన్స్‌దే గత కొన్నేళ్లుగా పై చేయి. ఈ వరుసలో భారత్‌ది 40వ స్థానం. ఏటా మనదేశాన్ని సందర్శించే విదేశీ పర్యటకుల సంఖ్య సుమారు 89 లక్షలు ఉంటే ఫ్రాన్స్‌కి వెళ్లేవాళ్లు ఎనిమిది కోట్ల మందికి పైనే. ఈ లిస్టులో తరవాతి పది దేశాలూ ఏవేంటో చూడండి.



| దేశాలు | ఏటా సందర్శించేవారి సంఖ్య కోట్లలో |
|---|---|
| 1. ఫ్రాన్స్ | 8.4 |
| 2. అమెరికా | 7.7 |
| 3. స్పెయిన్ | 6.8 |
| 4. చైనా | 5.6 |
| 5. ఇటలీ | 5.07 |
| 6. టర్కీ | 3.9 |
| 7. జర్మనీ | 3.5 |
| 8. మెక్సికో | 3.2 |
| 9. బ్రిటన్ | 3.2 |
| 10. రష్యా | 3.1 |

## ఎందరో నోబెల్ గ్రహీతలు



116 ఏళ్లలో మనదేశానికి వచ్చిన నోబెల్ బహుమతులు కేవలం ఎనిమిదే. ఇందులో ఠాగూర్, సీవీ రామన్, మదర్ థెరిసా, అమర్త్యసేన్, కైలాష్ సత్యార్థి భారత్‌లో ఉంటూ తెచ్చుకున్నారు. హర్‌గోవింద్ ఖురానా, సుబ్రమణ్యన్ చంద్రశేఖర్, వెంకట్రామన్ రామకృష్ణన్‌లు ప్రవాస భారతీయులు. నోబెల్‌ను ఎక్కువసార్లు అందుకున్న దేశాలేవో చూద్దామా...

| దేశాలు | నోబెల్ అందుకున్న వారి సంఖ్య |
|---|---|
| 1. అమెరికా | 353 |
| 2. బ్రిటన్ | 125 |
| 3. జర్మనీ | 105 |
| 4. ఫ్రాన్స్ | 61 |
| 5. స్వీడన్ | 30 |
| 6. స్విట్జర్లాండ్ | 25 |
| 7. జపాన్ | 24 |
| 8. కెనడా | 23 |
| 9. రష్యా | 23 |
| 10. ఆస్ట్రియా | 21 |

## బంగరు భారత్

బంగారం... ఆ పేరు వినగానే భారతీయులు పులకరించిపోతారు. ప్రతి దేశం తమ దేశ ఆర్థిక స్థితికి భరోసాగా జాతీయ బ్యాంకులో ముడి బంగారాన్ని నిల్వచేస్తుంది. వరల్డ్ గోల్డ్ కౌన్సిల్ ప్రకారం అలా ఎవరు ఎక్కువ దాచారో చూద్దామా...

*మన దేశంలో గుడుల్లోనూ ప్రజల ఇళ్లలోనూ ఉన్న బంగారాన్ని ఈ లెక్కలోకి తేలేదు కానీ తెస్తే అమెరికాను వెనక్కు నెట్టేసేదే.*



| దేశాలు | బంగారం నిల్వ టన్నుల్లో | రూ. లక్షల కోట్లలో |
|---|---|---|
| 1. అమెరికా | 8,133 | 27 |
| 2. జర్మనీ | 3,378 | 11 |
| 3. ఇటలీ | 2,451 | 8 |
| 4. ఫ్రాన్స్ | 2,435 | 8 |
| 5. చైనా | 1823 | 6 |
| 6. రష్యా | 1498 | 5 |
| 7. స్విట్జర్లాండ్ | 1040 | 3.4 |
| 8. జపాన్ | 765 | 2.5 |
| 9. నెదర్లాండ్స్ | 612 | 2 |
| 10. భారత్ | 557 | 1.8 |

## అక్కడుండాలంటే కష్టమే

కొన్ని ప్రాంతాల్లో రెండువేల రూపాయలుంటే నెల గడిచిపోతుంది. మరికొన్ని చోట్లకెళ్తే అంతకు నాలుగింతలు కావాల్సి రావొచ్చు. అలా ఆహారం, బట్టలు, గృహావసరాలు, ప్రయాణ ఖర్చుల ఖరీదుని బట్టి 'ఎకనమిస్ట్ ఇంటెలిజెన్స్ యూనిట్' సర్వే చేసి ఈ ఏడాది ఇచ్చిన నివేదిక ప్రకారం ప్రపంచంలోనే ఖరీదైన 133 నగరాల వరుసలో మొదటి స్థానంలో సింగపూర్ ఉంటే దిల్లీ 124వ స్థానంలోనూ ముంబై 127లోనూ ఉన్నాయి. మరి, మొదటి పదిస్థానాల్లో ఏవున్నాయో చూడండి...

1. సింగపూర్
2. హాంకాంగ్
3. జ్యురిక్ (స్విజర్లాండ్)
4. టోక్యో(జపాన్)
5. ఒసాకా(జపాన్)
6. సియోల్ (సౌత్ కొరియా)
7. జెనీవా (స్విట్జర్లాండ్)
8. పారిస్ (ఫ్రాన్స్)
9. న్యూయార్క్
10. కోపెన్‌హగెన్ (డెన్మార్క్)

## చదివేస్తున్నారు

ఏటా ఎన్నో మంచి పుస్తకాలు కొత్తగా మార్కెట్లోకి వస్తుంటాయి. కానీ కొన్ని పుస్తకాలు ఏళ్ల కిందట ముద్రణకు వచ్చినా ఇంకా ఆదరణ కోల్పోవు. అమ్మకాల్లో ముందుంటాయి. అవే ఇవి.




| పుస్తకం పేరు | అమ్ముడైన ప్రతులు కోట్లలో |
|---|---|
| 1. హోలీ బైబిల్... | 600 |
| 2. కొటేషన్స్ ఫ్రమ్ ఛైర్మన్ మావో | 500 |
| 3. డాన్ క్విగ్జోట్ | 50 |
| 4. ఏ టేల్ ఆఫ్ టూ సిటీస్ | 20 |
| 5. ద లార్డ్ ఆఫ్ ద రింగ్స్ | 15 |
| 6. లీ పెటిట్ ప్రిన్స్ | 14 |
| 7. హ్యారీ పాటర్ అండ్ ద ఫిలాసఫర్స్ స్టోన్ | 10.7 |
| 8. ద హాబిట్ | 10 |
| 9. అండ్ దెన్ దేర్ వర్ నన్ | 10 |
| 10. డ్రీమ్ ఆఫ్ ది రెడ్ ఛాంబర్ | 10 |



ఒక్కో ఊరికీ ఒక్కోరకం ఆచార సంప్రదాయాలు ఉండడం సహజమే. కానీ ఆ ఊరి ఆచారం మాత్రం దేశాన్ని ప్రేమించడం. అందుకే, అక్కడ వంద కుటుంబాలుంటే రెండొందలమంది సైనికులున్నారు. ఇంటికొకరినైనా సైనికుణ్ని చెయ్యాలన్నదే ఆ గ్రామం ఆచారం మరి.

# ప్రతి ఇంట్లోనూ ఓ సైనికుడు!



మాజీ సైనికులు



యువసేన

ఆజాద్ హింద్‌ఫౌజ్... భరతమాతను బానిస సంకెళ్ల నుంచి విముక్తి చెయ్యడానికి సుభాష్ చంద్రబోస్ స్థాపించిన ఈ సంస్థలో అప్పట్లో దేశవ్యాప్తంగా వివిధ గ్రామాల నుంచి ఎందరో యువకులు సైనికులుగా చేరారు. అలాంటి ఓ గ్రామమే చిత్తూరు జిల్లా, గుడిపాల మండలం, కుప్పిగానిపల్లె. ఈ ఊరు నుంచి దాదాపు ఇరవైమంది యువకులు బోస్ సైన్యంలో పనిచేసేందుకు వెళ్లారు. వారిలో ఇద్దరు వేరు వేరు పోరాటాల్లో ప్రాణాలొదిలారు కూడా. తర్వాత నేతాజీ మరణించారు. స్వాతంత్ర్య సమరమూ ముగిసింది. కానీ ఆ ఊరి ప్రజల మనసుల్లో నాటుకున్న దేశభక్తి మాత్రం అంతకంతకూ పెరిగింది తప్ప తగ్గలేదు. అందుకే, ఇక్కడ ఏ ఇంట్లో అయినా మగ పిల్లాడు పుడితే సైన్యంలో చేర్పించాలనేది ఓ ఆచారంగా మారింది. కనీసం పదిహేనేళ్లైనా సైనికుడిగా దేశ సేవ చెయ్యాలన్నది యువకుల ఆశయమైంది. ఊరి మొత్తమ్మీదా వంద కుటుంబాలుంటే రెండొందలమందికి పైగా సైనికులున్నారంటేనే కుప్పిగానిపల్లె ప్రజల సంకల్ప బలం ఎంత గొప్పదో అర్థం చేసుకోవచ్చు. వీరిలో ప్రస్తుతం సరిహద్దుల్లో పహారా కాస్తున్నవారు 70 మంది వరకూ ఉండగా మరో 140 మంది మాజీ సైనికులున్నారు.

***నాంది ఇలా...***

స్వాతంత్ర్యానికి ముందు కుప్పిగానిపల్లె నిరుపేద గ్రామం. అప్పట్లో కొందరు కుటుంబాన్ని పోషించుకునేందుకు కూడా సైన్యంలో చేరారు. కానీ ప్రస్తుతం పరిస్థితి మారింది. ఊరు అభివృద్ధి చెందింది. ప్రజలు ఆర్థికంగా స్థిరపడ్డారు. ఇప్పటి పిల్లలు ఉన్నత చదువులు చదువుతున్నారు. అయినా తాము కూడా సైన్యంలో చేరాలనుకుంటున్నారే తప్ప మరో ఉద్యోగం కోసం ప్రయత్నించేవారు చాలా అరుదు. ఎందుకలా... అంటే 'చిన్నప్పట్నుంచీ మా తాతలూ నాన్నల్నీ సైనికులుగా చూస్తూ, దేశ సరిహద్దుల్లో వారు చేసిన సాహసాల గురించి వింటూ, పెరిగిన మాకు సైనిక వృత్తిలో చేరడం ఓ కలలా మారిపోతుంది. ఎంత చదువు చదివినా మనసు ఆర్మీ వైపే లాగుతుంది' అంటారు ఇక్కడి కుర్రాళ్లు. తల్లిదండ్రులు కూడా తమ పిల్లలు ఏసీ గదుల్లో కూర్చుని పనిచేయడం కన్నా సైనికుడిగా కనిపిస్తేనే తమకెక్కువ సంతోషం అంటారు. గ్రామానికి చెందిన సరోజమ్మ, సుందరవరదయ్య దంపతులకు ఐదుగురు కొడుకులు. వారిలో ముగ్గురు- మాధవ, రవి కుమార్, కృష్ణ మూర్తి ఆర్మీలో పనిచేశారు. వారి అల్లుడు కూడా సైనికుడే. మాధవ కార్గిల్ యుద్ధంలోనూ పాల్గొన్నాడు. ఇలా ఈ ఊళ్లో ప్రతి ఇంట్లోనూ ఇద్దరు నుంచి అయిదుగురు వరకూ సైన్యంలో పనిచేసి తిరిగొచ్చినవారూ లేదంటే ప్రస్తుతం సైన్యంలో పనిచేస్తున్నవారూ ఉంటారు. స్వాతంత్ర్యానికి ముందు గ్రామానికి చెందిన విజయరామాంజులు బ్రిటిష్ సైన్యంలో రాయల్ కమిషన్ ఆఫీసర్‌గా పని చేశారు. గోవింద్ శెట్టి, రామయ్య శెట్టి అనే ఇద్దరు రెండో ప్రపంచ యుద్ధంలో పాల్గొని ప్రాణాలొదిలారు. సరిహద్దుల్లో కాపలా అంటే ఇలా ఏ సమయంలో ఏం జరుగుతుందో తెలియని పరిస్థితి. అయినా ఇక్కడి మహిళలు అధైర్యపడకుండా తమ పిల్లలూ భర్తలూ సైన్యంలోకి వెళ్తున్నారంటే ఆనందంగా సాగనంపుతారు. తమ వాళ్లు సైనికులు అని చెప్పుకోవడం వారికంత గర్వకారణం మరి.

***అందరూ కలిసే జాతర***

కుప్పిగానిపల్లెలో ఏటా మే నెలలో గంగమ్మ జాతర మూడు వారాల పాటు అంగరంగ వైభవంగా జరుగుతుంది. ఆ సమయంలో దేశ సరిహద్దుల్లోనూ వివిధ ప్రాంతాల్లోనూ పనిచేసే సైనికులంతా రావడంతో ఊళ్లో పండుగ వాతావరణం కనిపిస్తుంది. జాతర మొదలయ్యే రోజున గ్రామస్థులంతా కొత్త బట్టలు కట్టుకుని మేళ తాళాల మధ్య అంబలి బోనాలను తలమీద పెట్టుకుని ఊరేగింపుగా వెళ్లి గంగమ్మకు సమర్పిస్తారు. దీంతోపాటు ఈ గ్రామంలో మరో ఆచారం కూడా ఉంది. ఆర్మీ ఎంపికకు వెళ్లేటపుడూ, కొత్తగా సైనిక విధుల్లో చేరేముందూ స్థానికంగా ఉండే రామాలయాన్ని దర్శించుకుంటే కచ్చితంగా ఉద్యోగం వస్తుందనీ, సైనికులు క్షేమంగా ఇంటికి చేరతారనీ నమ్ముతారు ఇక్కడి ప్రజలు.

ఇక, దేశం మీద ప్రేమ ఈ ఊరికీ మంచే చేసింది. మగవాళ్లు ఆర్మీలో చేరి డబ్బు పంపించడంతో కుటుంబాలు ఆర్థికంగా నిలదొక్కుకున్నాయి. ఊరు అన్నివిధాలా అభివృద్ధి చెందింది.

ఇదీ సైనికులపల్లె కథ!

– కరీముల్లా షేక్, ఈనాడు, చిత్తూరు

ఫొటోలు: చొప్పా సుబ్రమణ్యం



# పచ్చదనానికి ఫ్రేముకట్టి...









**ఇంట్లో ఎంత ఖరీదైన కళాఖండాలైనా ఉండనివ్వండి... కానీ కంటికెదురుగా రకరకాల మొక్కలు కనిపిస్తుంటే వచ్చే అందం, మనసుకు కలిగే ఆహ్లాదం వేరు. 'ఇంటిలోపల అలంకరణ కోసం మొక్కల్ని పెంచడమా... అదో పెద్ద పని' అని మనం సందేహించాల్సిన అవసరం కూడా లేదు. గోడల్ని ఇంతందంగా మార్చిన ఈ మొక్కలు సహజమైనవి కాదు మరి.**








పచ్చదనం... ఈ తరానికి అత్యంత అపురూపమైనది. పట్టణాలూ నగరాల్లో ఇంటి బయట చెట్లు కనిపించడం మామూలుగానే అరుదు. దానికి తోడు పగలంతా ఆఫీసుల్లో ఆ తరవాత ఇంటి పనుల్లో బిజీ బిజీ. ఇక, కాసేపు బయట తిరిగి ప్రకృతి అందాలను ఆస్వాదించేంత తీరిక ఎక్కడుంటుంది. అందుకే, ఇప్పుడు ఇంటి అలంకరణలో మొక్కలూ ముఖ్యమైన భాగం అయిపోతున్నాయి. అందులోభాగంగానే హాల్లో టీపాయ్‌ల మీదికి లక్కీప్లాంట్లూ ఇంటి మూలల్లోకి మనీ ప్లాంటుల్లాంటివి వచ్చి చేరాయి. మొక్కల మీద మరీ ప్రేమ ఎక్కువైపోయినవాళ్లు వాటిని గోడలమీదికీ ఎక్కించే ప్రయత్నం చేశారు. కానీ ఈ తరహా వర్టికల్ గార్డెన్స్‌కి నీరు పొయ్యడం, మొక్కల్ని ఎప్పటికప్పుడు తీరుగా కత్తిరించడం శ్రమతో కూడుకున్న పనే. ఏమాత్రం అశ్రద్ధ చేసినా ఉన్న అందం కూడా పోతుంది. అలా కాకుండా ఇంటికి బోలెడంత అందాన్నీ కంటికి ఆహ్లాదాన్నీ పంచేందుకు వస్తున్నవే 'త్రీడీ ఆర్టిఫీషియల్ వాల్ హ్యాంగర్ సక్యులెంట్ ప్లాంట్స్'. బుల్లి బుల్లి కళాఖండాల్లా ఉన్న ఈ రంగురంగుల సక్యులెంట్ మొక్కలు చూడ్డానికి అచ్చం సహజమైనవాటిలా ఉంటాయి. కానీ నిజానికి ఇవి ప్లాస్టిక్, రబ్బరుతో చేసినవి. కాబట్టి, నెలకో రెండు నెలలకో వీటిని తీసి, నీటితో శుభ్రం చేసుకోవడం తప్ప మరో పనుండదు. ఇక, మామూలుగానే సక్యులెంట్ మొక్కలంటే మహా అయితే ఒక్కోటి అరచెయ్యంత సైజు ఉంటాయి. ఆకర్షణీయమైన రూపాల్లో వేరు వేరు వర్ణాల్లో మొక్కలే పూల గుత్తుల్లా ఉండే వీటిని విడివిడిగా ఫ్రేముల్లో పెట్టి అయిదూ పదీ ఫ్రేముల్ని గోడకు అమర్చితే హాలంతటికీ సరిపోయే అందమూ మనసంతా పులకరించిపోయే ఆహ్లాదమూ సొంతమవుతాయనడంలో ఆశ్చర్యమేముందీ.

## ఎంతో వినూత్నంగా...

సరికొత్త అలంకరణకు స్వాగతం చెప్పాలనుకునేవారికి్కూడా కృత్రిమ సక్యులెంట్ మొక్కలు బాగా నచ్చుతాయి. చూడచక్కని ఫ్రేముల్లో అడుగున ప్లాస్టిక్ గడ్డీ ఆ పైన రకరకాల మొక్కలూ అమర్చి ఉండే వీటిని గోడలమీద మనకు నచ్చిన ఆకృతిలో అమర్చుకోవచ్చు. ఇందులో చతురస్రంతోపాటు, దీర్ఘ చతురస్రం, హృదయాకార ఫ్రేములూ ఆన్‌లైన్‌లో దొరుకుతున్నాయి. ఇంకెందుకాలస్యం, ఇంటికి కొత్తందాన్ని తెచ్చేయండి మరి..? ★






## మెరిసే డైనోసార్...!





డైనోసార్ ఆకారంలో ఉండే బొమ్మలతో ఆడుకునే ఉంటారు. డైనోసార్ లైట్లనూ చూసుంటారు. కానీ ఈ 'డైనోపెట్' బొమ్మ వాటన్నిటి కంటే భిన్నమైంది.
ఈ బొమ్మతో పాటుగా వచ్చే రెండు ప్యాకెట్లలో సముద్రపు నీళ్లూ, పోషకాల పొడీ ఉంటాయి. డైనోసార్ అడుగున ఉండే రంధ్రంలోంచి నీళ్లు పోసి, ఆ నీళ్లలో ప్యాకెట్‌తోపాటు ఇచ్చిన పొడి వేసి ఈ బొమ్మను కాసేపు ఎండలో పెట్టాలి. ఆ సముద్రపు నీళ్లలో ఉండే ఒక ప్రత్యేకమైన ఆల్గే సూర్యరశ్మిని గ్రహించి రాత్రిళ్లు మెరుస్తుంది. దాంతో మొత్తం బొమ్మ మెరుస్తూ కనువిందు చేస్తుంది. మెరుపు తగ్గినపుడల్లా కాసేపు ఎండలో పెడితే సరిపోతుంది.

## దారి కనుక్కోండి

నీటి అడుగున ఉన్న అబ్బాయికి పైకి చేరుకునే దారి చూపండి.




## ఏది భిన్నం?

ఇక్కడున్న మసీదుల్లో మిగతా వాటికంటే భిన్నంగా ఉన్నది ఏది?




## జతపరచండి

ఇక్కడ ఉన్న రెండేసి విడి భాగాలను జతచేస్తే పూర్తి ఆకారం వస్తుంది. ప్రయత్నించండి.




## పోలికలేంటి?

ఇక్కడ తొమ్మిది బొమ్మలు ఉన్నాయి కదా. అడ్డం, నిలువు, ఐమూలగా వాటి మధ్య ఉన్న పోలికలను చెప్పండి.





## గప్‌చుప్

1. టేబుల్ పక్క వైపు నాలుగు బొమ్మలు ఉన్నాయి కదా. వాటిలో రాత్రి పూట మాత్రమే సంచరించేవి ఏవి?
2. ఇక్కడ ఒక తప్పుంది. ఏమిటది?
3. టార్గెట్ బోర్డు చూశారుగా. మరి లక్ష్య సూచీ ఎక్కడ ఉంది?
4. ఇక్కడ ఒక కన్ను బొమ్మ కూడా ఉంది. కనిపించిందా?

## స్వేచ్ఛ

ఒక ఊరిలో రాము అనే అబ్బాయి ఉండేవాడు. ఒక్కడే సంతానం కావడంతో తల్లిదండ్రులు రాముని ఎంతో అపురూపంగా చూసేవాళ్లు. ఒకసారి రాము సంతలో చిలుకను చూసి ముచ్చటపడితే దాన్ని కొని తెచ్చాడు తండ్రి. చిలుకను పంజరంలో పెట్టి ఎంతో బాగా చూసుకునేవాడు రాము. దానికి రోజూ జామపండ్లూ, రకరకాల గింజలూ తినిపించేవాడు. అయితే చిలుక వాటిని ఇష్టంగా తినేదికాదు. పైగా ఎప్పుడూ దిగులుగా ఉండేది. ఆహారం కోసం అడవంతా తిరిగి వెతుక్కోవాల్సిన పనిలేకుండా అన్నీ తెచ్చి దాని కాళ్ల దగ్గరే పెడుతున్నా చిలుక ఎందుకలా ఉంటుందో రాముకి అర్థమయ్యేదికాదు.

ఒకసారి రాముకి జ్వరం రావడంతో తల్లిదండ్రులు అతడిని కొన్ని రోజులపాటు బడికి పంపలేదు. స్నేహితులతో ఆడుకోడానికి బయటకు వెళ్లనివ్వలేదు. ఇంట్లోనే మంచం దిగకుండా జాగ్రత్తగా చూసుకునేవారు. కొన్ని రోజులకు జ్వరం తగ్గినా నీరసంగా ఉండటంతో రామూను బడికి పంపలేదు తల్లిదుండ్రులు. జ్వరం వచ్చిన నోటికి కాస్త రుచికరంగా ఉంటుందని ఎన్నో రకాల పండ్లు కొనుక్కొచ్చాడు తండ్రి. రాముకి ఇష్టమైన వంటలన్నీ చేసి తినమని బతిమాలేది తల్లి. కానీ రాముకి ఒంటరిగా కూర్చుని అవేమీ తినాలనిపించేదికాదు. రాము రోజూ సాయంత్రం స్నేహితులతో కలిసి కాసేపు ఆటలాడే వాడు. అలా ఆటలాడి అలసిపోయి ఇంటికి వచ్చి అమ్మ చేసిన చిరుతిళ్లను ఎంతో ఇష్టంగా తినేవాడు. కానీ ఇప్పుడు కదలకుండా ఇంటి దగ్గరే ఉండటం వల్ల ఏమీ తినాలనిపించలేదు. ఎంతో దిగులుగా, ఒంటరిగా అనిపించింది. వెంటనే అతడికి చిలుక పరిస్థితి గుర్తొచ్చింది. అది జామపండ్లను తినకుండా ఎందుకలా దిగులుగా ఉంటుందో తెలిసింది. ఆకాశంలో స్వేచ్ఛగా ఎగురుతూ చెట్ల మీద వాలి, ఇష్టమైన పండ్లు తినేదాన్ని పంజరంలో పెట్టడమంటే బందిఖానాలో ఉంచినట్లేనని అర్థమైంది. తను చేసిన తప్పేంటో తెలిసివచ్చిన రాజు చిలుకను పంజరంలోంచి తీసి విడిచి పెట్టేశాడు. అంతే సంతోషంగా పైకి ఎగిరిపోయింది చిలుక.

## తప్పుతప్పు

ఈ బొమ్మలో కొన్ని తప్పులు ఉన్నాయి. వాటిని కనిపెట్టండి.

అమ్మ బుర్రలో
నా ఆకలిని
గుర్తించే
యాప్ ఉంది!

## రంగులేద్దాం

## జవాబులు

**గప్‌చుప్:** 1. గుడ్లగూబ, గబ్బిలం 2. కుక్క ప్రతిబింబం కంటిలో తిరగేసి ఉంది 3. కుక్క బొమ్మకు పైభాగంలో ఉంది 4. కర్టెన్ మీద ఉంది.

**పోలికలేంటి?:** అడ్డం: పూలు, ఏనుగు తోకను పైకిలేపింది, రాళ్లు; నిలువు: కొమ్మను పట్టుకుంది, దంతాలు, నడవడం; ఐమూల: పండ్ల చెట్టు, సీతాకోకచిలుక.

**ఏది భిన్నం?:** 5

**తప్పుతప్పు:** ఆపిల్‌పండ్ల మీద పుచ్చకాయ ఉండటం, మొక్కకు ఐస్‌క్రీమ్ కోన్‌లు కాయడం, తినే ప్లేటులో డైస్, నీళ్లక్యాన్ పైభాగంలో పంపు, బెంచ్‌కి ఒకవైపు ఆధారంగా నీళ్లసీసా, భుజానికి తగిలించుకున్న బ్యాగు బెల్టు కట్ అయినా బ్యాగ్ పడిపోకుండా ఉండటం, అమ్మాయి జుట్టుకు రాళ్లు వేలాడటం, చెట్టుతొర్రలో గ్లాసు ఉండటం.

**జతపరచండి:** 1-10, 2-6, 3-9, 4-7, 5-8.

# నైవేద్యం సమర్పయామి!






## డ్రైఫ్రూట్స్ బొబ్బట్లు

**కావలసినవి**

మైదాపిండి: 2 కప్పులు, నెయ్యి: 4 టేబుల్‌స్పూన్లు, ఉప్పు: చిటికెడు, జీడిపప్పు పొడి: అరకప్పు, బాదంపప్పు పొడి: అరకప్పు, యాలకుల పొడి: టీస్పూను, బెల్లం తురుము: అరకప్పు, అంజీర్ పేస్టు: పావుకప్పు, ఎండుకొబ్బరి తురుము: 2 టీస్పూన్లు

**తయారుచేసే విధానం**

★ ముందుగా మైదాపిండిని శుభ్రం చేసుకోవాలి. ఓ గిన్నెలో మైదా, ఉప్పు, టీస్పూను నెయ్యి వేసి సరిపడా నీళ్లతో చపాతీపిండిలా కలిపి ఓ గంటసేపు నాననివ్వాలి.

★ వేరే గిన్నెలో జీడిపప్పుపొడి, బాదంపప్పుపొడి, అంజీర్‌ముద్ద, ఎండుకొబ్బరి తురుము, యాలకులపొడి వేసి బాగా కలిపి చిన్న చిన్న ముద్దల్లా చేసుకోవాలి.

★ మైదాపిండిని పూరీల్లా చేసి దాని మధ్యలో కలిపిన జీడిపప్పు, బాదంపొడి మిశ్రమాన్ని ఉంచి అంచులు మూసేసి బొబ్బట్ల మాదిరిగా వత్తాలి. పెనంమీద నుంచి నెయ్యి వేస్తూ రెండువైపులా కాల్చి తీయాలి.

## సెనగల రవ్వ పులిహోర



**కావలసినవి**

బియ్యపురవ్వ: కప్పు, ఉడికించిన కాబూలీ సెనగలు: అరకప్పు, మినప్పప్పు: 2 టీస్పూన్లు, పచ్చిసెనగపప్పు: 2 టీస్పూన్లు, పల్లీలు: 2 టీస్పూన్లు, ఆవాలు: పావుటీస్పూను, జీలకర్ర: పావు టీస్పూను, ఇంగువ: కొద్దిగా, పసుపు: చిటికెడు, నిమ్మరసం: టీస్పూను, ఎండుమిర్చి: రెండు, పచ్చిమిర్చి: రెండు, కరివేపాకు: 4 రెబ్బలు, ఉప్పు: తగినంత, నూనె: 3 టీస్పూన్లు

**తయారుచేసే విధానం**

★ ముందుగా బియ్యపురవ్వను రెండు కప్పుల నీటిలో పసుపు, కొద్దిగా నూనె వేసి పొడిపొడిగా ఉండేలా ఉడికించాలి.

★ బాణలిలో నూనెకాగాక ఎండుమిర్చి, మినప్పప్పు, పచ్చిసెనగపప్పు, ఆవాలు, జీలకర్ర, పల్లీలు, ఇంగువ, పచ్చిమిర్చి, కరివేపాకు, ఉడికించిన కాబూలీ సెనగలు వేసి వేయించాలి. ఓ గిన్నెలో ఉడికించిన బియ్యపురవ్వ, వేయించిన సెనగల పోపు మిశ్రమం, తగినంత ఉప్పు, నిమ్మరసం వేసి కలిపితే పులిహోర రెడీ.

## బొబ్బర్ల వడలు



**కావలసినవి**

బొబ్బర్లు: 2 కప్పులు, పచ్చిమిర్చి: నాలుగు, అల్లం: చిన్నముక్క, జీలకర్ర: టీస్పూను, కొత్తిమీర: పావుకప్పు, కరివేపాకు: పావు కప్పు, ఉప్పు: తగినంత, నూనె: వేయించడానికి సరిపడా

**తయారుచేసే విధానం**

★ బొబ్బర్లను సుమారు ఆరుగంటలపాటు నానబెట్టాలి. నానాక నీళ్లు వంపేసి మిక్సీలో అల్లం, పచ్చిమిర్చి, బొబ్బర్లు, ఉప్పు వేసి కచ్చాపచ్చాగా రుబ్బాలి. అది గిన్నెలోకి తీసుకున్నాక కరివేపాకు, కొత్తిమీర, జీలకర్ర వేసి కలిపి వడల్లా చేసి కాగిన నూనెలో వేయించి తీయాలి.

## క్యారెట్-కొబ్బరి పూర్ణాలు



**కావలసినవి**

మైదాపిండి: కప్పు, బియ్యప్పిండి: కప్పు, క్యారెట్ తురుము: కప్పు, నెయ్యి: 2 టీస్పూన్లు, పచ్చికొబ్బరితురుము: అరకప్పు, యాలకులపొడి: టీస్పూను, పంచదార: అర కప్పు, వంటసోడా: చిటికెడు, ఉప్పు: కొద్దిగా, నూనె: వేయించడానికి సరిపడా

**తయారుచేసే విధానం**

★ ఓ గిన్నెలో మైదాపిండి, బియ్యప్పిండి, వంటసోడా, ఉప్పు, నీళ్లు పోసి పలుచగా దోసెల పిండిలా కలపాలి.

★ పాన్‌లో నెయ్యి వేసి క్యారెట్ తురుము వేసి వేగనివ్వాలి. పచ్చికొబ్బరిని కూడా వేసి వేగాక అందులోనే పంచదార, యాలకులపొడి వేసి వేయించాలి. మిశ్రమం దగ్గరగా అయ్యాక దించి చల్లారనివ్వాలి. తరవాత చిన్న ఉండల్లా చేసి పక్కన ఉంచుకుని మైదాపిండి మిశ్రమంలో ముంచి పూర్ణాల్లా వేయించి తీయాలి.

## హయగ్రీవ పాయసం



**కావలసినవి**

సెనగపప్పు: 2 కప్పులు, బెల్లం తురుము: ఒకటిన్నర కప్పులు, నెయ్యి: 2 టేబుల్‌స్పూను, గసగసాలు: టీస్పూను, ఎండుకొబ్బరిపొడి: 2 టేబుల్‌స్పూన్లు, డ్రైనట్స్ (జీడిపప్పు, బాదం, ఎండుద్రాక్ష): 2 టేబుల్‌స్పూన్లు

**తయారుచేసే విధానం**

★ గసగసాలు కొద్దిగా వేయించి చల్లారాక, ఎండుకొబ్బరితో కలిపి పొడి చేయాలి.

★ సెనగపప్పుని రాత్రంతా నానబెట్టాలి. మర్నాడు ఉదయాన్నే ఓ గిన్నెలో నాలుగు కప్పుల నీళ్లు పోసి, చిటికెడు పసుపు వేసి మరిగించాలి. తరవాత అందులో నానబెట్టిన సెనగపప్పు వేసి, నీళ్లు మరిగిన తరవాత సిమ్‌లో పప్పు మెత్తబడే వరకూ ఉడికించి దించాలి. నీటిని వేరుచేసి రసం కానీ సాంబారులోగానీ వాడుకోవచ్చు. పప్పుని మాత్రం విడిగా తీసి ఉంచాలి. మందపాటి గిన్నెలో బెల్లం తురుము వేసి అందులో అరకప్పు నీళ్లు పోసి మరిగించాలి. పాకం కాస్త చిక్కబడ్డాక మంట తగ్గించి, అందులో టేబుల్‌స్పూను నెయ్యి వేసి, ఉడికించిన సెనగపప్పు వేసి మరిగించాలి. తరవాత ఎండుకొబ్బరి, గసగసాల పొడి వేసి కలిపి స్టవ్‌మీద నుంచి దించాలి. విడిగా చిన్న పాన్‌లో డ్రైనట్స్ అన్నీ వేయించి వాటిని పాయసంలో కలిపితే సరి.



- బి.శివపార్వతి
భట్టిప్రోలు, గుంటూరు



'విద్యార్థులకు కేవలం చదువులే కాదు, ఆటాపాటా సరదాసందడీ అన్నీ ఉండాలి' అంటున్నారు అమెరికాలోని పెన్సిల్వేనియా విశ్వవిద్యాలయంలో చదువుతున్న భారతీయ విద్యార్థులు. అందుకే ఒక బృందంగా ఏర్పడి పాటలు పాడటం మొదలుపెట్టారు. పాట వారికి ఆటవిడుపుతోపాటు అభిమానుల్నీ తెచ్చిపెట్టింది.

# మన పాట అమెరికాలో హిట్!



పెన్సిల్వేనియా యూనివర్సిటీ భారతీయ విద్యార్థుల్లో పాటలంటే ఇష్టపడేవాళ్లు ఏర్పాటు చేసుకున్న బృందమే penn masala. పాటలు పాడటమే అయినా వీరి రూటు మాత్రం కాస్త భిన్నం... ఎలాంటి వాద్య పరికరాలూ లేకుండా కేవలం నోటిద్వారా శబ్దాలు చేస్తూ, చప్పట్లూ, చిటికెలూ, ఈలలతో నేపథ్య సంగీతం అందిస్తారు. ఇలా స్టేజిమీద ప్రదర్శన ఇవ్వడాన్ని 'కపెల్లా' అంటారు. వీరు ఈ తరహాలోనే పాటలు పాడి వినిపిస్తారు. దాదాపుగా బాలీవుడ్ పాటలనే పాడి వినిపిస్తారు. పాటలకు ఒరిజినల్ ట్యూన్లు ఉంచుతూ, కొన్నిసార్లు చిన్న మార్పులుచేసి పాడతారు. బాలీవుడ్ పాటలతో మొదలైనా ఇప్పుడు ఆలపించేవాటిలో పాశ్చాత్య గీతాలూ ఉంటున్నాయి. కొన్నిసార్లు రెంటినీ కలగలిపి భారతీయ, అమెరికా సంస్కృతుల్ని దగ్గర చేర్చే ప్రయత్నం చేస్తున్నారు.

### పాటల ఎంపిక కీలకం

'పెన్ మసాలా' 1996లో నలుగురితో మొదలైంది. ఆ బృందంలో సంతోష్ గోవిందరాజు ప్రధాన వ్యక్తి.

అప్పట్నుంచీ ఏటా యూనివర్సిటీలో చేరే వారిలో పాటలంటే ఆసక్తి ఉన్నవారు ఈ బృందంలో సభ్యులైపోతున్నారు. కొత్తగా చేరే వారికి ప్రత్యేక శిక్షణ ఇస్తారు. సీనియర్లు వెళ్తున్నా కొత్తవారు చేరుతుండటంతో 'పెన్ మసాలా' సంప్రదాయం ఇప్పటికీ కొనసాగుతూ వస్తోంది. ప్రస్తుతం దీన్లో 14మంది విద్యార్థులున్నారు. బృందంలోని పాత సభ్యులూ క్యాంపస్‌కు వచ్చి ప్రదర్శన ఇచ్చే ప్రత్యేక కార్యక్రమం ఏడాదికోసారి ఏర్పాటు చేస్తారు. అంటే, ఒకసారి సభ్యులైతే ఎప్పటికీ ఆ బృందంలో కొనసాగుతున్నట్లే. అలా దాదాపు 100కుపైగా శాశ్వత సభ్యులున్నారు. హిందీ, ఇంగ్లిష్ పాటలు పాడగలిగేవారితో పాటు హిందీ పాటలు నేర్చుకోవాలనుకునే వారూ బృందంలో ఉన్నారు. దీన్లో ప్రధానంగా భారతీయ, భారత సంతతి విద్యార్థులు ఉన్నప్పటికీ, వాళ్లే ఉండాలన్న నియమమేమీ లేదు. భారతీయుడు కాకపోయినా ప్రస్తుత బృందంలో హిందీ పాటలూ పాడుతున్నాడు బ్రెండన్. సంగీతం, సాహిత్యం, ప్రేక్షకాదరణ.. . ఈ మూడు అంశాల్నీ దృష్టిలో పెట్టుకొని పెన్ బృందం పాటల్ని ఎంపికచేసుకుంటుంది. వీరు పాడే పాటలు మాతృకకి ఏమాత్రం తీసిపోకుండా ఉంటాయి. 'బార్ బార్ దేఖో...', 'హాల్ కైసా హై జనాబ్ కా...', 'హమ్మ హమ్మ...' లాంటి పాత పాటలతోపాటు ఈమధ్య వచ్చిన 'బేఫిక్రే' సినిమాలోని 'నషేసే చద్ గయా' లాంటి పాటల్నీ అద్భుతంగా పాడతారు.

### శ్వేత సౌధంలో ప్రదర్శన

పెన్సిల్వేనియా క్యాంపస్‌లో మొదలైన 'పెన్ మసాలా' రాగం అమెరికాలోని 50కి పైగా విశ్వవిద్యాలయాల్లోనూ వినిపించింది. ఇప్పటివరకూ వివిధ యూనివర్సిటీల్లో 100కి పైగా ప్రదర్శనలు ఇచ్చిందీ బృందం. 2009లో ఒబామా అధ్యక్షుడిగా ఉన్న సమయంలో శ్వేతసౌధంలో జరిగిన దీపావళి వేడుకల్లో వీరు ప్రదర్శన ఇచ్చారు. ఐక్యరాజ్యసమితి మాజీ ప్రధాన కార్యదర్శి బాన్‌కీమూన్, సచిన్ తెందూల్కర్, లక్ష్మీ మిత్తల్, ముఖేశ్ అంబానీ ఇలా ఎందరో వీరి ప్రదర్శనలకు వెళ్లి పాటల్ని ప్రత్యక్షంగా విన్నారు. 2014లో ఐఫా అవార్డుల వేదికమీదా వీరు పాడారు. 2015లో వచ్చిన హాలీవుడ్ సినిమా 'పిచ్ పెర్‌ఫెక్ట్2'లో ప్రదర్శన ఇస్తూ కనిపించారు. అమెరికాతో పాటు భారత్‌లోనూ వీరికి అభిమానులున్నారు. వీరు అప్పుడప్పుడూ ఆల్బమ్‌లనీ తీసుకొస్తుంటారు. 'యువ' పేరుతో తాజాగా పదో ఆల్బమ్‌ని తీసుకొచ్చారు.

ఈ ఏడాది ఏప్రిల్-మేలలో 'యువ' ప్రచార పర్యటనలో భాగంగా 14 మందితో కూడిన బృందం భారత్, యూఏఈలలో ప్రదర్శనలిచ్చింది. యువ ఆల్బమ్‌లో హిందీ-ఇంగ్లిష్ మాషప్స్, హిందీ పాటలతోపాటు బృంద సభ్యులు రాసి, స్వరపర్చిన పాట కూడా ఉంది. 'సొంత పాటల్ని తేవడంవల్ల మా ఆలోచనల్నీ, సృజనాత్మకతనీ వెలికి తీసే అవకాశం ఉంటుంది' అని చెబుతారు బృంద సభ్యులు. ఈ బృంద సభ్యులు పెన్సిల్వేనియా విశ్వవిద్యాలయానికి అనధికార రాయబారులుగా మారడాన్ని గుర్తించిన యూనివర్సిటీ యాజమాన్యం వారి పర్యటనలకు ఆర్థికంగా చేయూతనిస్తోంది కూడా.

### యూట్యూబ్ ఛానెల్

మొదట్లో వీరి పాటల్లో ఆడియో ప్రధానంగా ఉండేది. ఇటీవల వీడియో పాటల్నీ చిత్రీకరిస్తున్నారు. యూట్యూబ్‌లో 'పెన్ మసాలా' ఛానెల్‌లో వీడియోల్ని పెడుతున్నారు. 'ఇవల్యూషన్ ఆఫ్ బాలీవుడ్ మ్యూజిక్' పేరుతో తెచ్చిన వీడియోలో బాలీవుడ్ సంగీతంలో 1940ల నుంచి నేటివరకూ వచ్చిన మార్పుల్ని పాటల రూపంలో అయిదు నిమిషాల్లోనే చూపారు. పాటలతోపాటు కాలానికి తగ్గట్లు సభ్యులు వస్త్రధారణ మార్చుతూ చేసిన ఆ వీడియోకి పాతిక లక్షల వీక్షణలు వచ్చాయి. వీరు రూపొందించిన 'అంత్యాక్షరి' పాట కూడా మంచి ప్రాచుర్యం పొందింది. వందకుపైగా వీడియోలున్న వీరి యూట్యూబ్ ఛానెల్‌కు లక్షకుపైగా చందాదారులున్నాయి. 2002లో మొదటిసారి భారత్‌లో ప్రదర్శన ఇచ్చిన 'పెన్ మసాలా' బృందం ఇప్పటివరకూ ఆరుసార్లు పర్యటించింది. ముందుముందూ పర్యటిస్తామని చెబుతున్నారు బృందంలోని సభ్యులు. ఈసారి మీరూ వీరితో గొంతు కలపండి మరి! 





# రాశి ఫలం

గ్రహబలం (జులై 30 - ఆగస్టు 5)

డా॥ శంకరమంచి రామకృష్ణ శాస్త్రి





**మేషం** అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం

ధనలాభం సూచితం. అవసరాలకు మించిన ఖర్చు ఉంటుంది. భూలాభం, వాహన సౌఖ్యాలు న్నాయి. భగవదనుగ్రహంతో ఒక ఆపద నుంచి బయటపడతారు. శారీరక శ్రమ పెరుగుతుంది. ఉత్సాహంతో పనులు ప్రారంభిస్తే అంతా అనుకూలంగానే ఉంటుంది. వివాదాలకు ఇది సమయం కాదు. ఆరోగ్యంపై దృష్టి సారించాలి. సూర్య నమస్కారం ఉత్తమ ఫలాన్నిస్తుంది.



**వృషభం** కృత్తిక 2,3,4 పాదాలు; రోహిణి, మృగశిర 1,2 పాదాలు

మంగళప్రదమైన కాలం నడుస్తోంది. ధర్మావలంబనతో విజయప్రాప్తి కలుగుతుంది. ఏ పని మొదలుపెట్టినా వెంటనే పూర్తిచేయగలుగుతారు. నూతన బాధ్యతలు వస్తాయి. ప్రయత్న లోపం లేకుండా పనిచేయండి. ఉద్యోగ, వ్యాపారయోగాలు బాగున్నాయి. ఆశించిన ఫలితం దగ్గరే ఉంది. కృషితో లక్ష్యం సిద్ధిస్తుంది. ఇష్టదేవతాస్మరణ శ్రేయస్సునిస్తుంది.



**మిథునం** మృగశిర 3, 4 పాదాలు, ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పాదాలు

విజయం లభిస్తుంది. పట్టుదల ఆశయాన్ని సిద్ధింపచేస్తుంది. ఉత్సాహంగా పనిచేస్తే ప్రశంసలు అందుకుంటారు. ఐశ్వర్యప్రాప్తి ఉంది. కొన్ని విషయాల్లో అధైర్యం ఆవహిస్తుంది. మిత్రుల సలహాలతో సమస్యలు దూరమవుతాయి. ఒక వార్త శక్తినిస్తుంది. మనోబలంతో పనులు పూర్తిచేయగలుగుతారు. ఆరోగ్యం మిశ్రమంగా ఉంటుంది. ఆదిత్య హృదయం చదవాలి.



**కర్కాటకం** పునర్వసు 4వ పాదం; పుష్యమి, ఆశ్లేష

ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాలి. కాల ప్రభావం అనుకూలంగా లేదు. ముఖ్య కార్యాల్లో ఏకాగ్రత పెంచండి, అదే మిమ్మల్ని ఆపదల నుంచి రక్షిస్తుంది. మోసంచేసే వారున్నారు. ధన విషయాల్లో జాగ్రత్తగా వ్యవహరించండి. బంధుమిత్రుల అండదండలున్నాయి. సమయస్ఫూర్తి చాలా అవసరం. ఆంజనేయస్వామిని ధ్యానిస్తే మంచిది.



**సింహం** మఖ, పుబ్బ, ఉత్తర 1వ పాదం

తెలివిగా ఆలోచిస్తే విజయం మీదే. మంచి భవిష్యత్తు గురించి ఆలోచనలు చేయండి. అభివృద్ధే లక్ష్యంగా పనిచేయండి. జ్ఞాన సముపార్జన చేస్తారు. ఆర్థిక పరిపుష్టి లభిస్తుంది. బుద్ధిబలం వల్ల అనేక మార్గాల్లో ఆదాయం పెరిగే సూచన ఉంది. ఎవరి మీదా శత్రుభావం పెంచుకోవద్దు. అందరినీ ఆదరించడం అవసరం. సుబ్రహ్మణ్యస్వామి ధ్యానం మేలు చేస్తుంది.



**కన్య** ఉత్తర 2, 3, 4 పాదాలు; హస్త, చిత్త 1, 2 పాదాలు

మంచి పనుల వల్ల మానసిక ప్రశాంతత పొందుతారు. ఆత్మబలంతో సంపూర్ణ కార్యసిద్ధి లభిస్తుంది. సాహసంతో కూడిన విజయం ఉంది. పట్టుదలతో పనిచేస్తే అనుకూల పరిస్థితులు నెలకొంటాయి. ధర్మాచరణ అనుసరణీయం. ఉద్యోగ వ్యాపారాల్లో శుభఫలితాలున్నాయి. విఘ్నాలు వచ్చినా తట్టుకుని పనులు పూర్తిచేస్తారు. శివారాధన మంచి చేస్తుంది.



**తుల** చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు

ప్రజ్ఞాపాటవాలు విజయాన్ని తెచ్చిపెడతాయి. చెడు ఊహించవద్దు. అదృష్టయోగం ఉంది. అనుకున్నది సాధించే కాలమిది. విశేష ధనలాభం ఉంటుంది. భవిష్యత్ ప్రణాళికలు రచించండి. ఎంత కష్టపడితే అంత ఫలం దక్కుతుంది. కుటుంబ సభ్యులకు కలిసి వస్తుంది. అసూయతో ఆటంకపరిచే వారున్నారు. వాగ్వాదానికి దిగవద్దు. వేంకటేశ్వరస్వామిని దర్శించండి.



**వృశ్చికం** విశాఖ 4వ పాదం; అనూరాధ, జ్యేష్ఠ

ప్రశాంతంగా పనిచేయండి. లక్ష్యం పెట్టుకుని పనిచేస్తే అభివృద్ధి తప్పక లభిస్తుంది. సంపదలు సమకూరతాయి. ఒత్తిడిని సమర్థంగా జయిస్తారు. కుటుంబ సభ్యులతో సంప్రదించిన తర్వాతే ముఖ్య నిర్ణయాలు తీసుకోవాలి. మాట పట్టింపులకు పోవద్దు. అపనిందలు మోపేవారున్నారు. ధైర్యంగా సమాధానమిస్తే సరిపోతుంది. శివారాధన అవసరం.



**ధనుస్సు** మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పాదం

సంక్లిష్టమైన పరిస్థితులున్నాయి. స్వధర్మాచరణ బలంతో కష్టాలను అధిగమిస్తారు. అభివృద్ధి మార్గాన్ని ఎంచుకుని పనిచేయాలి. కొన్ని కార్యాలు మధ్యలో ఆగుతాయి. పెద్దల సహకారంతో కార్యసిద్ధి ఉంటుంది. కొన్ని వార్తలు ఉత్సాహాన్నిస్తాయి. ముఖ్యమైన పనులు నిదానంగా పూర్తి అవుతాయి. ఒత్తిడిని తట్టుకుంటే కార్యసఫలత ఉంటుంది. గణపతి ఆరాధన శుభప్రదం.



**మకరం** ఉత్తరాషాఢ 2, 3, 4 పాదాలు; శ్రవణం, ధనిష్ఠ 1, 2 పాదాలు

విజయావకాశాలున్నాయి. తొందరపాటు రానీయకండి. ఆర్థిక అభివృద్ధి పరిపూర్ణంగా ఉంది. మనశ్శాంతి లభిస్తుంది. పేరు ప్రతిష్ఠలు పెరుగుతాయి. శ్రద్ధతో పనులు చేయండి. ఈశ్వరానుగ్రహంతో అదృష్టవంతులవుతారు. పొరపాట్లు జరిగినా పెద్ద ఇబ్బందులు ఏమీ రావు. పూర్వ పుణ్య విశేషం వల్ల స్థిరమైన భవిష్యత్తు ఏర్పడుతుంది. సాయిబాబా దర్శనం శాంతినిస్తుంది.



**కుంభం** ధనిష్ఠ 3, 4 పాదాలు; శతభిషం, పూర్వాభాద్ర 1, 2, 3 పాదాలు

మంచి పనులు చేపడతారు. శీఘ్రకార్యసిద్ధి ఉంటుంది. ఆశించిన ఫలితం అందుతుంది. కొన్ని విషయాల్లో ధైర్యం అవసరమవుతుంది. చేయాలా వద్దా అనే సందేహం లేకుండా సంకల్పశక్తితో పనులు ప్రారంభించండి. శుభవార్త వింటారు. సకాలంలో ధనం అందుతుంది. ఉద్యోగ వ్యవహారాల్లో మంచి గుర్తింపు లభిస్తుంది. ఇష్టదేవతా దర్శనం శుభప్రదం.



**మీనం** పూర్వాభాద్ర 4వ పాదం, ఉత్తరాభాద్ర, రేవతి

శుభఫలితాలున్నాయి. దైవబలంతో ఒక పని పూర్తి అవుతుంది. దూరమైన బంధాలు దగ్గరవుతాయి. నిబద్ధతతో పనిచేసి విజయాన్నందుకుంటారు. ఆనందంగా కాలం గడుస్తుంది. చేయవలసిన పనులు స్పష్టమవుతాయి. కీర్తి ప్రతిష్ఠలున్నాయి. నిర్ణయాలు తీసుకునేప్పుడు ఇంట్లోవారితో సంప్రదించండి. నూతన కార్యాలు ఆరంభిస్తారు. అభివృద్ధికి శ్రీకారం చుడతారు. లక్ష్మీ అష్టోత్తరం చదవాలి.




## అనుబంధాల మకరందాలు

సమాజంలో రోజు రోజుకీ దిగజారుతున్న మానవీయ విలువల్నీ, అణగారి పోతున్న ఆదర్శభావాల్నీ, కనుమరుగవుతున్న మంచితనపు పరిమళాల్నీ తట్టిలేపే ప్రయత్నం లింగమూర్తి రచనల్లో సుస్పష్టం. 'ముష్టిపిల్ల' కథలో ఓ బిచ్చగత్తెని పెళ్లి చేసుకునే ప్రభాకర్, 'ప్రమాదము' కథలో పరాయివ్యక్తిపైన మన సుపడి, తరవాత తన తప్పు తెలుసుకుని పశ్చాత్తాపపడ్డ భార్యని చేరదీసే శ్యామలరావు పాత్రలు అందుకు ఉదాహరణ. ఆయన రచనలు అనుబంధాల మకరందాల్ని వెదజల్లుతాయి. 'చిత్తజల్లు' కథలో అన్నయ్య జ్ఞాపకంగా ఎన్నో ఏళ్లుగా దాచుకున్న చొక్కా గుండీ కనిపించనందుకు సత్యం పాత్ర పడే వేదనే అందుకు తార్కాణం. 'ఘరానా మనుషులు', 'ఆమె పలకలేదు', 'మరో జగత్తు' లాంటి కథలన్నీ మనుషుల్లోని భిన్న కోణాలని స్పృశిస్తాయి. కాలానుగుణంగా తెలుగు భాష ఎలా మారుతూ వచ్చిందో చెప్పడానికి లింగమూర్తి రచనలు మంచి ఉదాహరణలు.




**సింగరాజు లింగమూర్తి రచనలు- కథలు**
(రెండు సంపుటాలు)
**పేజీలు: 243 + 270;**
**వెల: రూ.170 + రూ.175/-**
**ప్రతులకు:** ప్రధాన పుస్తక కేంద్రాలు

– *శరత్*

## బతుకు 'చిత్రాలు'

ఉద్యోగంలోనో, వ్యాపారంలోనో, కార్మికులుగానో, మరేదైనా పనిలోనో.. ముంబయిలో కుదురుకున్న తెలుగువారు లక్షల్లోనే ఉన్నారు. ఒక్కొక్కరిదీ ఒక్కో కథ. కొన్ని కథలు విజయతీరాలకు చేరితే, మరికొన్ని సుడిగుండాల్లో చిక్కి, ఉక్కిరిబిక్కిరి అవుతుంటాయి. వారి జీవనంలో చోటు చేసుకున్న ఘటనలను వస్తువుగా తీసుకుని అబ్బురమనిపించే కథాశిల్పాలుగా మలిచారు రచయిత. ముంబయిలో పుట్టిపెరిగినా తెలుగుదనాన్ని నిండా నింపుకొన్న ఆయన తెలంగాణ మాండలికాన్ని ముంబయి యాసతో రంగరించి బిగి సడలని కథలు అల్లారు. ప్రతి కథలోనూ ఒక నీతీ కొసమెరుపూ ఉన్నాయి. ప్రతి పాత్రా బాగా పరిచయమైనదిలాగే అనిపిస్తుంది. వాటి వెనక కష్టాలూ కన్నీళ్లూ కనిపిస్తాయి. వివిధ పత్రికల్లో ప్రచురితమైన 56కథల సమాహారమిది.



**మనోల్ల ముంబయి కతలు**
రచన: అంబల్ల జనార్దన్
**పేజీలు: 337; వెల: రూ.300/-**
**ప్రతులకు:** ప్రధాన పుస్తకకేంద్రాలు

– *పి.దత్తారాం ఖత్రీ*

## ఊరికోసం... మనిషి కోసం...

ఊరంటే... ప్రజలతో కళకళలాడే ఇళ్లు, పచ్చని పొలాలతో ఆకు పచ్చ కోక కట్టుకున్నట్లుండే భూదేవి, పక్కనే చెరువు, దానిని ఆనుకుని కొండలు... కొన్ని దశాబ్దాల క్రితం పల్లెల్లో బాల్యం గడిపినవారి మదిలో అపురూపంగా దాగిన దృశ్యమది. కానీ ఇప్పుడు వెదికితే కన్పిస్తుందా? మానవత్వమే మంటగలిసి, మనిషే మాయమైపోతుంటే ఊరికోసం ఆలోచించేదెవరు? నీలకంఠ 'ఊరు కనబడుట లేదు' కథాసంపుటిలోని 25 కథలూ ఇలాంటి ప్రశ్నలనే లేవనెత్తుతాయి. తన చుట్టూ ఉన్న వ్యక్తుల్నీ వాళ్ల ప్రవర్తననీ నిశితంగా పరిశీలించే రచయిత అలవాటు కథల్లో ప్రతిఫలిస్తోంది. లుప్తమవుతున్న విలువలు, పెరుగుతున్న వస్తువ్యామోహం, పెచ్చుమీరుతున్న అన్యాయం పట్ల ఆవేదన కన్పిస్తుంది. ఆలోచింపజేసే అర్థవంతమైన కథలే అన్నీ.



**ఊరు కనబడుట లేదు**(కథాసంపుటి)
రచన: నీలకంఠ
**పేజీలు: 140; వెల: రూ.120/-**
**ప్రతులకు:** విశాలాంధ్ర బుక్‌హౌస్ శాఖలు

– *శ్రీ*

## పాటలు... మాటలు

శ్రీకృష్ణదేవరాయల కాలాన్ని ప్రతిబింబించే సినిమా తీయాలన్న ఆలోచన బి.ఎన్.రెడ్డికి వచ్చినప్పటినుంచి 'మల్లీశ్వరి' పూర్తవడానికి 12 ఏళ్లు పట్టిందట. ఆలోచనకు తాము అనుకున్న రూపమివ్వడానికి నాటి దర్శకులు రాజీపడకుండా పనిచేసేవారనడానికి నిదర్శనమిది. ఇలాంటి ఆసక్తికరమైన అంశాలతోపాటు ఆపాత మధురాలైన పలు పాటల సాహిత్యం, సంగీతం గురించి రాసిన విశేషాల సంకలనం ఈ పుస్తకం. ఆయా పాటలు వింటున్నప్పుడు తనలో కలిగిన స్పందనలు; వాటి గురించి తనకు తెలిసిన, సేకరించిన విషయాలను క్రోడీకరించి రచయిత ఇది రాశారు. 1951-55 మధ్య విడుదలైన 21 సినిమాల విశేషాలు ఇందులో ఉన్నాయి. సినీ సంగీత సాహిత్యాభిమానులకు నచ్చే పుస్తకం.



**ఆపాతమధురం** రచన: డా.రాజా
**పేజీలు: 154; వెల: రూ.250/-**
**ప్రతులకు:** ప్రధాన పుస్తక కేంద్రాలు. – *సుశీల*

**వైద్యం - ఆరోగ్యం**
**ప్రజారోగ్య సంరక్షణోద్యమ సంకలనం**
**సిరిసిల్ల సాహితీ సమితి**
పేజీలు: 68; వెల: రూ.50/-
ప్రతులకు: డా.జనపాల శంకరయ్య
సెల్: 94932 64120

**వాల్మీకి సహకారం**
**మనోవికాసానికి మహోపకారం**
రచన: ఎర్రాప్రగడ రామమూర్తి
పేజీలు: 108; వెల: రూ.100/-
ప్రతులకు: వై.శాంత
ఫోన్: 94905 20986

**చిలుకమ్మ పదాలు**
రచన: ధర్మపురి సరళ
పేజీలు: 108; వెల: రూ.50/-
ప్రతులకు: ధర్మపురి సరళ
ప్లాట్ నం.6; మై విల్లాస్
మల్లాపూర్, హైదరాబాద్

**అమృతవర్షిణి- శివానందలహరి**
**తెలుగు వివరణ- విశ్లేషణ**
రంగావజ్ఝల మురళీధరరావు
పేజీలు: 256; వెల: రూ.126/-
ప్రతులకు: శ్రీరాఘవేంద్ర పబ్లిషర్స్
శివకామేశ్వరి గ్రంథమాల, విజయవాడ

## బుక్ షెల్ఫ్

**సాయిత్రయి**
రచన: కపిలవాయి లింగమూర్తి
పేజీలు: 74; వెల: రూ.60/-
ప్రతులకు: ప్రధాన పుస్తకకేంద్రాలు

**నాన్న కావాలి**(దీర్ఘకవిత)
రచన: ఎస్.సుమిత్రాదేవి
పేజీలు: 48; వెల: రూ.50/-
ప్రతులకు: ప్రధాన పుస్తకకేంద్రాలు

**గతితప్పిన గమ్యం**
రచన: ఎడమ శ్రీనివాసరెడ్డి
పేజీలు: 216; వెల: రూ.120/-
ప్రతులకు: నవతెలంగాణ పబ్లిషింగ్ హౌస్, ఫోన్: 040-27660013

**బ్రహ్మనాయుడు**
రచన: శ్రీకృష్ణారావు
పేజీలు: 100; వెల: రూ.50/-
ప్రతులకు: రచయిత సెల్: 9440033715

**శ్రీచక్రము-మానవశరీరము**
**ఆధ్యాత్మిక వైజ్ఞానిక గ్రంథం**
రచన: డా.గుడిపాటి వి.ఆర్.ఆర్.ప్రసాద్
పేజీలు: 388; వెల: రూ.280/-
ప్రతులకు: రచయిత
సెల్: 9490947590

# పదవినోదం

కూర్పు: **బాలు**

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | ✻ | 3 | 4 | | ✻ | 5 | ✻ | 6 |
| | ✻ | | ✻ | 7 | ✻ | | ✻ | 8 | | 9 | |
| ✻ | 10 | | 11 | ✻ | 12 | | 13 | | ✻ | | ✻ |
| 14 | | ✻ | 15 | 16 | | ✻ | | ✻ | 17 | ✻ | 18 |
| ✻ | 19 | 20 | | | | | ✻ | 21 | | | |
| 22 | ✻ | 23 | | ✻ | | ✻ | 24 | ✻ | | ✻ | |
| 25 | 26 | | ✻ | 27 | | 28 | | 29 | ✻ | 30 | ✻ |
| 31 | | ✻ | 32 | | ✻ | | ✻ | 33 | 34 | | 35 |
| ✻ | 36 | 37 | | ✻ | 38 | ✻ | 39 | ✻ | 40 | | |
| 41 | | | ✻ | 42 | ✻ | 43 | | 44 | | ✻ | |
| 45 | | | 46 | ✻ | 47 | | ✻ | | ✻ | 48 | ✻ |
| ✻ | | ✻ | 49 | | | ✻ | 50 | | | | |

## ఆధారాలు

**అడ్డం:**

1. ఏకాదశి తిథి సంఖ్య! (4)
3. 'మల్లీశ్వరి' చిత్రంలో వెంకటేష్‌తో జతకట్టిన కథానాయిక ఈ కైఫ్! (3)
7. నిలువు 6తో కెరటం (1)
8. నడుచుకుంటూ వెళ్ళేవాడు (4)
10. తెర (3)
12. ఖడ్గం (4)
14. ఒక సినీ నటి; మనసులో పుట్టేది! (2)
15. దౌర్జన్యం, దాష్టీకం (3)
19. లంకేశ్వరుడు (6)
21. దుష్యంతుడి కుమారుడు (4)
23. సంవత్సరం (2)
25. కలుషిత జలాల ద్వారా వ్యాపించే ఒక వ్యాధి (3)
27. అందుకొరకే (5)
31. అడ్డం 19లోని వాడి రాజ్యం (2)
32. అడ్డం 15లో కొడుకు, అధికారి! (2)
33. ఎగుడు దిగుళ్లు లేని, చదునుగా ఉన్న (4)
36. ఉప్పు (3)
38. అడ్డం 7తో స్వప్నం (1)
40. చిన్నముక్క (3)
41. '... నాదశరీరాపరా'- శంకరాభరణం పాట గుర్తొచ్చిందా? (3)
42. అడ్డం 38తో ఏనుగు (1)
43. రహస్య సంప్రతింపులు (4)
45. జగడంతో (4)
47. శబ్దం, ధ్వని (2)
49. సదుపాయం (3)
50. ఉంగరం (5)

**నిలువు:**

1. ఖాతా (2)
2. 'కళావాచస్పతి' జగ్గయ్య ఇంటిపేరు? (3)
4. అగర్తలా ఏ రాష్ట్ర రాజధాని? (3)
5. బీద, ఏమీలేని (2)
6. విష్ణువు (2)
8. ఇందిరాగాంధీ అంతర్జాతీయ విమానాశ్రయంగా 1986లో పేరు మార్చకముందు ఢిల్లీ ఎర్‌పోర్ట్‌ను ఏమనేవారు? (2)
9. ధనుస్సు, విల్లు (2)
10. గస్తీ, కావలి (3)
11. అకృత్యాలు, ఘోరాలు (4)
12. సమాచారం తెలియదు, పిలుపు రాలేదు! (3+2)
13. వీధి (2)
16. యజమాని (2)
17. వంతెన (3)
18. పంచెకట్టి భుజాన ధరించేది? (3)
20. ఇంట్లో భాగం (3)
22. సర్వం, సమస్తం (3)
24. ప్రతిజ్ఞ, ప్రమాణం; భాష (2)
26. 'చంద్రముఖి' చిత్రం విడుదలయ్యాక జనంలో ప్రాచుర్యం పొందిన మాట? (6)
27. అంబుజం అంటే ఎర్రగన్నేరు. అంబుదం అంటే మబ్బు. ఆ రెండింటిలోనూ ఉన్న బాణం! (2)
28. సముద్రతీరం (2)
29. శరీరం (2)
30. అటు పిమ్మట (3)
32. శరం (2)
34. స్తోత్రాలు (3)
35. ఒకదాన్ని చూసి యథాతథంగా రాసింది! (3)
37. పంది (3)
39. దిగులు; ఒక చెట్టు! (2)
41. సందేహం (2)
43. దళసరి (2)
44. దిక్కులు ఎన్ని? (4)
46. దారి (2)
47. మగువ (2)
48. నీడ, ప్రతిబింబం (2)

## సుడొకు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | 5 | | | | | |
| 9 | | | | 8 | | 5 | | |
| 4 | | | | | 6 | 9 | 8 | |
| 6 | 5 | | 7 | | | 4 | 9 | 8 |
| 7 | 3 | | 9 | | 8 | | 5 | 1 |
| 8 | 4 | 9 | | | 5 | | 2 | 3 |
| | 6 | 3 | 1 | | | | | 9 |
| | | 7 | | 2 | | | | 5 |
| | | | | | 3 | | | |

## గతవారం సమాధానాలు

### పదవినోదం

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 మే | ఖ | 2 ల | ✻ | 3 సు | 4 వా | 5 స | న | ✻ | 6 బ | 7 లం | ✻ |
| న | ✻ | 8 లా | లి | ✻ | 9 న | మో | ✻ | 10 క్ష | ✻ | 11 చం | 12 పు |
| 13 క | 14 ప | టం | ✻ | 15 పం | ✻ | 16 స | 17 త | మ | 18 తం | ✻ | ట |
| ✻ | రా | ✻ | 19 పా | ట | 20 వం | ✻ | ప | ✻ | 21 డా | 22 బు | ✻ |
| 23 చ | క్ర | పా | ణి | ✻ | 24 శీ | 25 త | న | 26 గం | ✻ | 27 డి | గ్గీ |
| 28 ర | మ | ✻ | 29 గ్ర | 30 హం | ✻ | గ్గం | ✻ | 31 జ | 32 వా | బు | ✻ |
| ణం | ✻ | 33 త | హ | త | 34 హ | ✻ | 35 కం | ✻ | 36 క | డి | 37 మి |
| ✻ | 38 అ | ✻ | ణం | ✻ | 39 వం | 40 కా | ✻ | 41 గా | బు | ✻ | న్ను |
| 42 కో | న్న | 43 దే | ✻ | 44 అం | ✻ | 45 మా | 46 తు | లి | ✻ | 47 త | ✻ |
| ✻ | 48 ద | హ | 49 నం | ✻ | 50 క | ✻ | 51 ది | వా | క | రు | డు |
| 52 అ | మ్ము | ✻ | 53 బ | డ | లి | 54 క | ✻ | న | ✻ | వృ | ✻ |
| 55 న | లు | గు | రు | ✻ | 56 మి | సి | మి | ✻ | 57 దం | ✻ | 58 డెం |

### సుడొకు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 4 | 6 | 8 | 3 | 5 | 9 | 7 | 2 | 1 |
| 5 | 7 | 9 | 2 | 1 | 4 | 8 | 6 | 3 |
| 2 | 1 | 3 | 7 | 8 | 6 | 9 | 5 | 4 |
| 9 | 4 | 2 | 8 | 3 | 7 | 5 | 1 | 6 |
| 6 | 3 | 7 | 5 | 4 | 1 | 2 | 9 | 8 |
| 1 | 8 | 5 | 6 | 9 | 2 | 4 | 3 | 7 |
| 8 | 2 | 1 | 9 | 7 | 3 | 6 | 4 | 5 |
| 3 | 5 | 6 | 4 | 2 | 8 | 1 | 7 | 9 |
| 7 | 9 | 4 | 1 | 6 | 5 | 3 | 8 | 2 |










# కొండంచు ఊరు!

కొండల మీద ఊళ్లూ ఇళ్లూ ఉండటం మనకు తెలిసిందే. కానీ కొండఅంచున, ఇంకా చెప్పాలంటే కొండ అంచుదాటి బయటకు కూడా ఊళ్లోని ఇళ్లు ఉండటం ఆశ్చర్యకరమైన విషయమే. అలాంటి ఊరే స్పెయిన్‌లోని కొయెంకా. పద్నాలుగూ పదిహేను శతాబ్దాల్లోనే ఇక్కడి కొండ మీద ఊరు వెలిసింది. ఏళ్లు గడిచేకొద్దీ జనం పెరగడంతో ఒకపక్క అంతస్తులతో భవంతులు నిర్మించుకుంటూ, మరోవైపు కొండ అంచు వరకూ ఊరిని విస్తరిస్తూ వచ్చారట. బాల్కనీలు బయటికి కనిపిస్తున్న ఇక్కడి ఇళ్లను 'హ్యాంగింగ్ హౌసెస్' (వేలాడే ఇళ్లు)గా పిలుస్తారు. మధ్యయుగపు కట్టడాలుండే ఈ ఊరిని చూసేందుకు చాలా మంది పర్యటకులు వస్తుంటారు. ఇప్పటికీ ఇందులో చాలా కట్టడాలు అలాగే ఉండటంతో కొయెంకాను ప్రపంచ వారసత్వ సంపదగా ఐక్యరాజ్యసమితి గుర్తించింది. అవసరాన్ని బట్టి ఆలోచనలు వస్తాయి అంటే ఇదేనేమో!





